# సాహితి

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి సంపాదించినది

మొదటి వత్సరము



అయిదవ సంచిక

సాహితీసమితి

తెనాలి :: ౧౯౨౦

చందా రూపాయిన్నర: సంచిక పావలా

# విషయసూచిక

మొదటిసంవత్సరము: అయిదవసంచిక



'సాహితి' సంవత్సరమునకు ఆఱుసంచికలు. సంవత్సరపుచందా, పోస్టేజితో ౧-౮-౧: విడిసంచిక పోస్టేజికాక రూ ౦-౪-౧.
ఇందలి కథలలో పాత్రలు కేవలము కల్పితములు.
కథలు, వ్యాసములు, పద్యములు, సంపాదకునిపేర పంపవచ్చును.
చిరునామా మారినప్పుడు చందాదారులు మాకు తెలుపవలెను.
ప్రతిసంచికయు భద్రముగా పోష్టుచేయుదుము; సంచికలుపోయినప్పటికి మేము బాధ్యులము కాము.

---

'సాహితి' ఆఱవసంచికలో

'మాధవీకంకణము' సంపూర్ణమగును. 'పోయిననగ' 'చిత్రకారుఁడు' అనుకథలు, 'సాహిత్యసామగ్రి' 'సాహిత్యవిమర్శకులు' అను వ్యాసములు ప్రధానములు. ఆఱుసంచికలకును సూచీపత్రము (Index) ఉండును.

---




# గానమాధురి

విద్వాన్, శతావధాని, కోపల్లె శివకామేశ్వర రావు

చివురు చేతి మెత్తదనమ్ము చిరుగకుండ
గాజుల కలస్వనంబు మంగళము లొసఁగఁ
బాదు లొనరింపఁ బెరిగిన పాదపముల
నధివసింప వదేఁనో యమృత వాణి!

నీవాలికించు గానరస నిమ్నగ నోలల నాడ వచ్చి, యా
శా వియదంగణంబు విడ జాఱెను తారకలై విలోకనన్
ద్రోవలఁ బోవుచుండి రదె తుళ్ళిడు కాలువగట్టు వెంబడిం
దావులఁ జిమ్ము పూవుల విధమ్మును గానకె యిండ్లు సేరఁగన్.

సగము కొఱికిన మిగులు కసవు బయళ్ళఁ
బోషణము లేక పెరిగిన మొద్దు చెట్లు
మూపులే యైన నట వసింపంగ నేల
తీవె పందిళ్ళలో నున్న మావి వీడి?

ఈ కిసల ద్రసాల తను వెక్కి నదించెదు నిన్ను విన్నచో
నీ కలగీతిలో మెఱుగు నింపి సతుల్ ప్రియమానసంబులం
దో కల కలకంఠమా, మెలఁగుచుందురు; మాధవుతోడ నేఁగు నీ
వాకును నిల్పు తత్సతుల వాంఛల నైనను దీర్ప వేలొకో!

నెమరు వేసెడి మొదవులు నిలిచి నాదు
గానమును విన్న సంతృప్తి గలుగు నాకు;
సవ్వడియె లేక తనలోఁ బ్రసంగములను
జలుపు పచ్చిక నాతోడి చెలిమికత్తె!

# గానభంగము

నోరి నరసింహం

౧

సాయంత్రమయినది, అష్టమిచంద్రుడు నడిమింట వెలుగుతున్నాడు. రుక్మిణి పెనిమిటి వచ్చేందుకు ఇంకా చాలా ఆలస్యముంది. ఆమె దొడ్లో తులసికోటమీద కూర్చుని నెమ్మదిగా పాడుకుంటున్నది ఆపాట సగము సగముమాత్రమే వినవస్తున్నది. ఆమె చంద్రుణ్ణి తనకళ్ళకాంతితో వివశుణ్ణి చేయవలెనన్నదేమో! అటువైపే చూస్తున్నది మాటిమాటికీ చంద్రుడు తీరు పలుకుతున్నది. అదిచంద్రుణ్ణి పొగడే పాట అయియుంటుంది అలా ఉన్నరుక్మిణి కప్పుడు వాకిట్లో శ్రావ్యమైనసంగీతము వినబడ్డది. ఆగొంతు రాజగోపాలముది.

రాజగోపాలము చదువుకోడానికి వాళ్ళతల్లితో ఆఊరు వచ్చి నాలుగేళ్ళయినది. అప్పటినుంచీ వీళ్ళఇంట్లోనే పక్కభాగంలో అద్దెకున్నాడు. అతను సంగీతము చాలాబాగా పాడేవాడు కంఠము వేరేచెప్పనక్కరలేదు, కిన్నరకంఠము! సాయంత్రమింటికి రాగానే అతనికి ప్రతిరోజూకొంతసేపు పాడేఅలవాటు. రుక్మిణికి సంగీతమంటే చాలా ఇష్టము. రాజగోపాలం పాడేటప్పుడు ఆమె తప్పకుండా అక్కడికి వచ్చి వినేది. ఆమె వింటున్నకొద్దీ రాజగోపాలం ఉత్సాహంతో పాడేవాడు.

రాజగోపాల సంగీతము వినబడగానే మామూలుచొప్పున రుక్మిణి వినడానికి వాకిట్లోకివెళ్ళింది. అక్కడ రాజగోపాలమూ అతని తల్లీ తప్ప మరెవ్వరూ లేరు రుక్మిణి సద్దుచేయకుండా పోయి రాజగోపాలం తల్లిదగ్గర కూర్చున్నది.

ఆరోజు రాజగోపాలం పాడుతున్న పాట మునుపెప్పుడూ పాడిందికాదు గానముకూడా ఎప్పటికంటే మధురంగా ఉన్నది, ఆగానామృతాన్ని రుక్మిణి పరవశత్వముతో ఆస్వాదిస్తున్నది రుక్మిణి రావడం చూసి రాజగోపాలంమరీ బాగాపాడుతున్నాడు.

మబ్బేమీలేక ఆకాశం నిర్మలంగా ఉన్నది. నక్షత్రాలు ఒక్కటొక్కటే వచ్చి ఆకాశాన్ని అలంకరిస్తున్నవి. అంతటా ప్రశాంతముగా వెన్నెల కాస్తున్నది. ఆవినబడుతున్న సంగీతము రాజగోపాలముదో లేక ఆప్రశాంతపుసంగీతమేమో!

గీత మైపోయింది. కొంతసేపటికి సంగీతముకూడా నెమ్మదిగా ఆగింది సంగీతమాగంగానే ఎప్పుడూలేనిది ఆరోజు రుక్మిణిఒళ్ళు ఝల్లుమన్నది. ఆమె రాజగోపాలం వైపే చూస్తున్నది. కాని ఎప్పటివలె లేదాచూపు ఆమె ముఖాన నిగ్గుతెరకప్పి నట్లున్నది.

రాజగోపాలంతల్లి పెద్దవి పూర్వకాలపు మనిషి, పట్టి అమాయకురాలు. ఆమె, "నాయనా, రుక్మిణి నీపాట మొదటినుంచీ వినలేదు, కృష్ణుడికోసం పాడరా వింటుంది" అన్నది.

రుక్మిణి అనుకొన్నది అడగలేక కూడా అడగలేక ఊరుకున్నది. అది రాజగోపాలంతల్లే అడిగినందుకు లోపల సంతోషము రుక్మిణిచిరునవ్వుతో స్ఫుటంగా తెలిపింది. రాజగోపాలానికి రుక్మిణి తనసంగీతము వినడంకంటే కావలసిందేమీ లేదు. రుక్మిణి కన్నులవైపు ఒకసారి అతిప్రేమతో చూసి అతడు పాట మళ్ళీ ప్రారంభించాడు.

> మురళిముద్దిడు నీమోవి ముకుపు జూచి
> తపము తెరచీల్చి ప్రకృతి చైతన్యమూనె
> స్వరము వెలువడినంత గోపాలకృష్ణ,
> పులకరించె బృందావన పుణ్యభూమి.
> గోవులను వీడి యరుదెంచె గోపజనము
> కుడుచులేగల విడివచ్చె గోగణంబు
> పరుగు పరుగున నీపాదపదము జేర
> ప్రియుని విడనాడివచ్చె గోపీజనోఘ!
> యమునతో జేరు వారిలేశము విధాన
> రాగమున నేకమైన వ్రేమ్మురీతి
> తన్మయతనొంది కలసము స్తముతో డ
> తీనమైపోతి నీదివ్యగానసుధను!

రాజగోపాలం గీతము స్ఫుటంగా తెలుస్తున్నది. రుక్మిణిని సంతోషపెట్టడానికి అతను తన చేతనైనంత బాగా పాడుతున్నాడు. సంగీతము ఏలోపము లేక దివ్యముగా పాడవలెననే తప్ప అతని కప్పుడు వేరే స్మృతి లేదు. రుక్మిణి ఆసంగీతతరంగాలమీద ఊగులాడుతూ పరవశమై తేలిపోతున్నది.

పాట మళ్ళీ ఐపోయింది. తర్వాత కొంతసేపటిదాకా వాళ్ళుముగ్గురూ ఆ నాదానుభవంలో నిశ్శబ్దంగా ఉన్నారు. అప్పుడు రాజగోపాలంతల్లి సంతోషము తో నవ్వుతూ, "ఇదికృష్ణమూర్తి వేణునాదాన్ని గురించి," అన్నది.

"అవును. ఇవ్వాళ నే భాగవతంలో కృష్ణుడు వేణునాదం చెయ్యడము చదివినాను." అన్నది, రుక్మిణి.

రాజగోపాలంతల్లి; "ఆనాయన పిల్లంగోవి ఊదుతూఉంటే వినడానికి గోపికలంతా వచ్చేవాళ్ళుట. ఎక్కడెక్కడి ఆవులూ పరుగెత్తుకుని వచ్చేవిట. చిన్నికృష్ణుడు లోకాన్ని అంతా తనమాధుర్యంతో కప్పివేసేవాడు." రుక్మిణి, "మీరాజగోపాలం చాలాబాగా పాడుతాడు. మరీ ఇవ్వాళవింటూంటే సాక్షాత్తు ఆకృష్ణమూర్తి జ్ఞప్తికి వచ్చాడు," అన్నది.

తనకొడుకును పొగడినందుకు రాజగోపాలంతల్లి సంతోషించి, "ఇవ్వాళ చాలామంచి పాటే పాడినాడు," అన్నది.

రాజగోపాలానికి ఆరుక్మిణి మాటల్లో ఏదో చాలాధ్వనించింది. తనకోరిక పక్వానికి వస్తున్నదని రుక్మిణిముఖంవంక చూశాడు, రుక్మిణిచూపువల్ల అతనిఆశ మరికాస్త దృఢపడ్డది. ఎప్పుడూ గంభీరముగాఉండే ఆమెచూపులో ఆకోటి రాజగోపాలానికి మార్దవం కనిపించింది.

రుక్మిణి, "బృందావనంలో యమునానది ఒడ్డున కూర్చుని వెన్నెలరాత్రుళ్ళలో పిల్లంగోవి ఊదుతుంటే గొల్లపిల్లలు ఆవులను కాయడము విడిచిపెట్టిన

చ్చేవాళ్ళట. ఆవులు దూడలనువిడిచి వచ్చేవట. అది ఇవ్వాళ రాజగోపాలం పాడినపాటలోకూడా ఉన్నట్లుంది. 'గోవులనువీడియరుదెంచె ....' ఏదీ?" అని రాజగోపాలాన్ని ఆభాగంమళ్ళీ పాడమన్నది.

రాజగోపాలంవళ్ళు పులకరించి అక్కడనుంచి గీతంపాడినాడు. అతనితో రుక్మిణికూడా తన మధురకంఠం కలిపి పాడింది.

పరుగు పరుగున నీపాదపదము జేర
ప్రియుని విడనాడి వస్తి గోపీమనోజ్ఞ

అనే భాగందగ్గిరికి వచ్చేటప్పటికి రుక్మిణి కంఠము వణికి నట్టునట్టుగా చదివింది. రాజగోపాలంతల్లి, "అమ్మాయీ నోరు తిరగడంలేదా?" అని అడిగింది.

ఆమాటలకు రుక్మిణి ఉలిక్కిపడ్డది. ఆమె ఏమిజవాబు చెప్పుతుందో వినవలెనని రాజగోపాలం ఆతురపడుతున్నాడు. తనదౌర్బల్యము రాజగోపాలముతల్లి తెలుసుకున్నదా అనేక్షోభతో ఒకక్షణం గడిపి రుక్మిణి స్థైర్యము తెచ్చుకుని "ఆడవాళ్ళకు మరి బాగానోరు తిరుగుతుందా" అనితప్పించుకొని, "పాట మహాబాగున్నది. రాజగోపాలం నాకు కాస్త అది వ్రాసిపెడతావా?" అన్నది.

రాజగోపాలం నవ్వుతూ చప్పున 'పాటవ్రాసి పెటితే ఏమిస్తావు?" అన్నాడు.

"ఏమికావలెనంటే అది ఇస్తాను"

"ఏమికావలెనంటే అదే ఇస్తావా?"

"ఇస్తా!"

"ఏంకావలెనన్నా?" అనేప్పుడు "ఏం"అని ఒత్తిపలికినాడు రాజగోపాలం.

రుక్మిణి, "ఏంకావలెనన్నా!" అని జవాబు చెప్పింది.

రాజగోపాలము, "నీకళ్ళవంక చూడనియ్యడము కంటె మరేమీ అక్కరలే"దని మనస్సులో అనుకొని "నవ్వుల కన్నాను. అట్లాగే రేపు మధ్యాహ్నం వ్రాసిపెట్టుతాలే" అన్నాడు.

రుక్మిణి సంతోషించి మళ్ళీపాట పాడమన్నది. రాజగోపాలం పాడుతున్నాడు. చంద్రుడు చల్లటి వెన్నెల కురుస్తున్నాడు. రుక్మిణి కలవరిస్తున్నట్లుంది. వీధితలుపు చప్పుడైంది. కలవరించాననుకుంటూ రుక్మిణి పెనిమిటికి తలుపుతీయడానికిపరుగెత్తుకు పోయింది. పాటకాగానే రాజగోపాలం లేచి భోజనానికి వెళ్లాడు.

౨

రుక్మిణి పెనిమిటికి రెండోపెళ్ళి. ఆయనకు మొదటిభార్య ముప్పైయైదో ఏటనేపోయింది, విరక్తిచేత కొన్నాళ్ళు పెళ్ళిచేసుకోనని పట్టుపట్టాడు, కాని చివరకు ఒప్పుకోక తప్పిందికాదు. త్వరలోనే రుక్మిణ్ణి ఆయనపెళ్ళిచేసుకున్నాడు. ఆపెళ్ళిలోవరకట్నమే లేదు. రుక్మిణితల్లిదండ్రులకే కొంతధనం ముట్టిందని నిజమో అబద్ధమోకాని, ఒకవదంతి మాత్రమున్నది.

రుక్మిణి కాపరానికివచ్చి ఐదేళ్ళయింది. ఆసంసారములో కలతఅనేదే లేదు. పెనిమిటిఅంటే రుక్మిణిచాలాభక్తితోఉపచారంచేస్తుండేది. ఆయనకు

నల్లవై యేళ్ళుదాటినా రుక్మిణితనపేరిమిటి పెద్దవాడని ఎవ్వరినీ అననిచ్చేదికాదు. ఆభార్యాభర్తలు అదృష్టవంతులని అందరూ అనేవాళ్ళు.

వాళ్ళ ఇంట్లో రాజగోపాలమూ, తల్లీవచ్చిప్రవేశించి నాలుగేళ్ళయింది. వాళ్ళకు మనస్సుబాగా కలిసి ఒకరికొకరు సహాయంగా ఉండేవాళ్ళు. చాలా కాలమునుంచీఉండడంచేత వాళ్ళు బంధువులకంటే ఎక్కువస్వతంత్రింగా నీవంటే నీవనిపిలుచుకొనేవాళ్ళు. రాజగోపాలమూ రుక్మిణీ అన్నా చెల్లెలూవలే సిగ్గుపడకుండా మాట్లాడుకునేవాళ్ళు.

రుక్మిణి చాలా అందగత్తె. అందమంతా ఆమెకళ్ళల్లోమూర్తీభవించి ఉండేది. చూచిన వాళ్ళంతా ఆమె కళ్ళలో గొప్ప తేజస్సు ఉన్నదనేవాళ్ళు. ఆకళ్ళుచంచలమైనవికావు, అవి ఎప్పుడూ శాంతముగానూ గంభీరముగానూ ఉండేవి.

ఆరుక్మిణికళ్ళు రాజగోపాలాన్ని ఆకర్షించక ఊరుకోలేదు. కాని అతడక్కడికివచ్చిననాల్గేళ్ళదాకా తన్నవి ఆకర్షించినట్లు తెలుసుకోలేదు. కాని అవి మొదటినుంచీ అతన్ని ఆకర్షిస్తూనే ఉన్నవి. అంతకంతకు వాటిఆకర్షణబలం పెరిగింది. తాను రుక్మిణిని ప్రేమిస్తున్నానని తెలుసుకున్నతర్వాత మనస్సు మరలించుకోవలెనని ఎంతో ప్రయత్నంచేశాడు. అటునుంచి తప్పించవలెనని ప్రయత్నంచేసినకొద్దీ అతని బుద్ధి ఆమెవైపు మరింతపోయేది. ఆవాగులో దిగినతర్వాత దానికి ఎదురీదట మతనితరం కాకపోయింది.

రుక్మిణికి తనపైనప్రేమ ఉన్నదేమో తెలుసుకోవలెనని రాజగోపాలం చాలా ప్రయత్నంచేశాడు. ఆమె ప్రతిరోజూ అతనిపాట వినడానికి వచ్చేది. ప్రతిరోజూ వాళ్ళు ఇదీ అదీ మాట్లాడుకునేవాళ్ళు. రుక్మిణి ఎప్పుడూ గంభీరంగా ఉండేది. రాజగోపాలం ధైర్యము చాలక తనప్రేమ ఎప్పుడూఆమెకు సూచనగా కూడా తెలియజేయలేదు. రుక్మిణికి ప్రేమ తలంపుకూడా ఉండేదికాదు.

చివరకు ఆసంగీతము పాడినరోజు రుక్మిణికి తనపైన ప్రేమ పుట్టినట్లు తెలుసుకొని రాజగోపాలం సంతోషించాడు. అప్పటి దాకా శాంతముగా ఉండేరాజగోపాలం మనస్సు ఆపైన నిల్వలేక పోయింది. ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు ఆమె కనపడుతుందా; ఎప్పుడామెకుపాటవ్రాసిపెట్టుతానా అనే ఆతృతలో అతని కారాత్రి కూనుకుపట్టలేదు. మర్నాడు తనప్రేమ అంతా రుక్మిణికి తెలియ జెప్పిందుకు తెల్లవార్లూ మాటలాలోచించుకుంటూ పడుకున్నాడు.

3

మర్నాడు మధ్యాహ్నం గదిలోకూర్చుని రాజగోపాలం పుస్తకం చూస్తున్నాడు. రాజగోపాలం పుస్తకమువంక చూస్తున్నాడే కాని అతనిమనస్సు అక్కడలేదు. ఎక్కడన్నా చీమ చిటుక్కుమంటే తలుపుతీసి చూస్తున్నాడు, కాస్తసేపే రాజగోపాలానికి చాలాసేపుగా కనబడుతున్నది. ఎంతసేపు ఎదురుచూసినా రుక్మిణి పాటవ్రాయించుకో

డానికీ రావడంలేదు.

కొంతసేపటికి అతనికి అడుగులచప్పుడు వినవచ్చింది. ఆత్రంతో రాజగోపాలం తలుపు తెరచి చూశాడు. ఆవచ్చింది అతని తల్లి. ఆమెను చూచి తనతొందర అణచుకొని అతను, "ఏమమ్మా?" అన్నాడు.

"అబ్బాయీ, ఇవ్వాళపొద్దు కూకే దాకా పురాణం చదవుతారట. ఆబ్రాహ్మడు పుస్తకం బాగాచదువుతున్నాడు. నేను వచ్చేప్పటికి కాస్త ఆలస్యమవుతుంది. ఎక్కడికీ వెళ్ళక ఇంట్లోనే ఉండు," అని తల్లి రాజగోపాలానికి ఇల్లు వప్పగించి పోయింది.

రాజగోపాలం పుస్తకము అవతలపారేసి అటూఇటూ తిరుగుతున్నాడు. అకస్మాత్తుగా గది తలుపు తెరచుకున్నది. అప్పుడు రుక్మిణి స్వతంత్రంగా గదిలోకి వచ్చి, "ఇప్పుడు పాట వ్రాసిపెడతావా?" అని అడిగింది. రాజగోపాలం సరే అని విడిగా పెట్టిఉన్న కాగితమూ కలమూ పట్టుకున్నాడు.

రుక్మిణి చిరునవ్వునవ్వి, "పాప..! నాకోసము కాగితమూ, కలమూ సిద్ధంగా పెట్టుకున్నట్టున్నావు. విడికాగితము మీద వ్రాస్తే ఇక్కడా అక్కడా పడిపోతుంది. నాపాటల పుస్తకంమీద వ్రాసి పెట్టు!" అన్నది.

రాజగోపాలం రాత్రినుంచీ అందామనుకొన్న మాటల్లో ఒక్కటీ అనలేకపోయినాడు. మంత్రిగాని చేతులో బొమ్మవలె అతనుఇంట్లోకి వెళ్ళుతున్న రుక్మిణి వెంటనే బయలుదేరిపోయినాడు.

వాళ్ళు వెళ్ళేప్పటికి నావట్లో ఒకచిరుచాపమీద కలమూ సిరాబుడ్డీ సిద్ధంగా పెట్టి ఉన్నవి. రుక్మిణి తనపాటలపుస్తకము తీసుకొనివచ్చి రాజగోపాలానికిచ్చింది. రాజగోపాల మాచాపమీద కూర్చుని గీతము వ్రాస్తున్నాడు. రుక్మిణి నవ్వుమొగంతో అతని పక్కనే కూర్చుని అతను వ్రాస్తున్న గీతము మెల్లిగా పాడుతున్నది.

నాలుగు బంతులు వ్రాయడమైంది. ఐదోబంతి రాజగోపాలం వ్రాయబోతున్నాడు. రుక్మిణి చెయ్యి అడ్డంపెట్టి, "కాసేపు పుస్తకం అవతలపెట్టి నే నడిగేదానికి జవాబుచెప్పు!" అన్నది.

రాజగోపాలం పుస్తకం కిందపెట్టి, "నీప్రశ్న ఏమిటి?" అన్నాడు.

"నీకిప్పుడెన్నేళ్ళు?"

"ఇరవైరెండేళ్ళు."

"చాలాసంబంధాలు తిరిగిపోతున్నవికదా, ఈయేడువివాహం చేసుకోవా?"

రాజగోపాలం సిగ్గుతో కొంతసేపు జవాబుచెప్పక చివరకు ఆమెవైపు తలయెత్తి "చేసుకోను" అన్నాడు.

రుక్మిణి గంభీరముఖంతో రాజగోపాలాన్ని చూసి, "పెద్దవాడివయ్యేదాకా ఉండబోకు. చిన్నవాళ్ళు పెద్దవాళ్ళను చేసుకుంటే సుఖపడరు," అన్నది.

"నీవు సుఖపడడం లేదా?" అనేప్రశ్న మాటిమాటికీ రాజగోపాలానికి నోటిదాకా వస్తున్నది. ఆమాటఅంటే రుక్మిణి సంతోషిస్తుందో లేక నొచ్చుకుంటుందో! ఆమెముఖాన గాంభీర్యము ఎంతమూ తగ్గలేదు. ఆమాట బిగ్గరగా అనడానికి

సాహసించక రాజగోపాలం పుస్తకము తీసుకొని మళ్ళీ వ్రాయమొదలు పెట్టాడు.

ఇంకో నాలుగుబంతులు వ్రాయడమైంది. రుక్మిణి రాజగోపాలం చేతులో నుంచి పుస్తకం లాక్కుని అతనివైపుతిరిగి ఆగీతం బహుశ్రావ్యంగా పాడింది. అది పాడేటప్పుడు రుక్మిణికళ్ళు అభినయం చేస్తున్నట్టు రాజగోపాలానికి తోచింది, అతడు ఆనందంతో వివశుడైనాడు. ఏమేమో మాట్లాడవలెననుకుంటాడు కాని ఎంతకూ అతనినోట మాటరాదు. చివరకు అతను అతిప్రయత్నంమీద వినపడకుండా "ఇంకోసారి" అన్నాడు.

రుక్మిణి చిరునవ్వు నవ్వి ఇంకోసారి పాడింది. ఈమారు పాడేటప్పుడు అభినయం మరింతస్ఫుటంగా కనిపించింది. పాట కాగానే ఆమె 'సరిగా పాడినానా?" అని అడిగింది.

రాజగోపాలం ఆమె ముఖాన్ని తదేకదృష్టితో చూస్తూ మెల్లిగా "దివ్యంగా ఉంది!" అన్నాడు.

ఆమాటలు రుక్మిణి వినిపించుకోక నవ్వుతూ "ఎప్పుడూ అట్లా మాట్లాడకుండా నాకళ్ళవంకే చూస్తావేం? నాకళ్ళకు దృష్టికూడా తగులుతుందేమో!" అన్నది.

రాజగోపాలం ఉలిక్కిపడి వణుకుతూ చప్పున తలవంచుకున్నాడు. రుక్మిణి పక్కుమని నవ్వి అతనివీపు తనచేతితో తట్టి "భయపడకు ఇట్లా ఔతే రేపు కాపర మెలా చేస్తావు?" అని అతనిచేతికి పాటలపుస్తక మిచ్చి పాట పూర్తి చెయ్యమన్నది.

పువ్వువంటి ఆమె చెయ్యి తనవంటికి తాకగానే ఒక్కక్షణంసేపు రాజగోపాలం పరవశత్వం పొందినాడు, కాని రుక్మిణి మాటలకుమాత్రము అతను చాలా సిగ్గుపడి వంచినతల ఎత్తకుండా భయమేమిటి? అంటూనే మళ్ళీ గీతము వ్రాస్తున్నాడు.

గీతము వ్రాయడం పూర్తికాగానే 'అయింది' అని రాజగోపాలం కలమూ పుస్తకమూ నెమ్మదిగా కింద పెట్టాడు.

"అప్పుడే అంతా ఐపోయిందా? అందులో తప్పులు లేకుండా చూడు" అన్నది రుక్మిణి రాజగోపాలం చదివి చూసి తప్పు లేమీ లేవన్నాడు.

రుక్మిణి అప్పుడా పుస్తకం తీసుకుని 'అంతా ఇదేనా' అంటూ రెండుమూడుసార్లు చదివి చూసుకున్నది. తప్పులేమీ లేవు.

ఇంతలో వీధితలుపువద్ద కొద్దిగా అలికిడి ఐంది.

రాజగోపాలం 'ఇక వెళ్ళేదా' అని లేచి వెళ్ళబోతున్నాడు.

రుక్మిణి అతన్ని ఆపి, "కాస్త ఆగు, పాట వ్రాసినందుకు ఏ మియ్యమంటావు?" అన్నది.

'నీకు పాటవ్రాసి ఇచ్చినందుకు ఏం తీసుకుంటాను?"

"నిన్ను అడిగితివి కాదా ఏం కావలెనో అడుగు!"

"నాకు కావలసిందా ఏముంది? నిన్న

నవ్వుల కన్నాను."

"నిన్న అన్నమాట నవ్వులకేనా? నీకు కావలసిం దేమీ లేదా?"

రుక్మిణి స్వరం కఠినంగా ఉన్నది. రాజగోపాలం 'లేదు' అనలేక పోయినాడు. కొంతసేపుండి తలయెత్తి అతనామెను సాభిప్రాయంగా చూచి "ఆకళ్ళు..." అని ఏదో గొణుగుకున్నాడు.

రుక్మిణి ముఖం పైకెత్తింది, రాజగోపాలం పెదవి రుక్మిణి కళ్ళను తాకబోతుంది. వీధితలుపు పగిలేట్లు దడదడ చప్పుడైంది. రాజగోపాలం మెల్లిగా తన గదిలోకి వెళ్ళిపోయినాడు. రుక్మిణి పోయి తన పెనిమిటికి తలుపు తీసింది.

... ... ...

"మునుపు కొత్త సంగీతము పాడేవాడివి. ఇప్పుడు పాడనే పాడడం లేదేమిరా?" అని ఒకనాడు సాయంత్రము రాజగోపాలాన్ని తల్లి అడిగింది.

"అమ్మా పరీక్షలు వచ్చినవి కాదటే!" అన్నాడు రాజగోపాలం.

# ఏలా?

"గిరికుమార"

తేనియలు జాల్చునేయమ్మ, యైనగాని
కోకిల కుహూరవమ్ములకున్, మురిపెపు
గోత్రమాని శిశుస్ఫుటకూం గలట్టి
ప్రకృతి రాహస్య దివ్యసంబధ మేలా?

మనుజుని హృదంతరాళమ్ము, మదవతీవి
లోచనాకృష్టపూర్ణమై, పూచినట్టి
సన్నవిరిజాజి పూతీవ చెన్నుపైగాలి
వాసనా దార్ఢ్యత్వమ్ము పరపుటేలా?

ప్రాతరున్మిలితాంచితాబ్జాత చల ద
లీరవామోద రసధునీలీలలకును,
నన్య మెఱుగంగలేని చైతన్యహీన
మైనప్రకృతి స్వరూపసంధాన మేలా?

బండిగురువింద పూతీవ నిండుకోర్కె.
ప్రాజ్య యౌవన సామ్రాజ్యపట్టభద్ర
తా సముత్సాహ మిళితకాతర్యమైన
తరుణి తాంబూలరాగంబు తగులుటేలా?

శరదమలమేఘమాలి కాసముదయంబు
కన్న, ప్రళయావసాన దుష్కాల తీవ్ర
మారుతము కన్న మనుజుని మనసునకును
గలిగి యుండిన యట్టివేగమ్మదేలా?



# మాధవీకంకణము

౧౮

జస్వంతసింగు సైనికులు మిగిలిన కొద్దిమంది రాజస్థానాభిముఖులై చనఁ జొచ్చిరి. తనప్రియమిత్ర మగు గజపతిసింగుమరణమునకు మిగుల దుఃఖము నొందినను నరేంద్రుఁ డనుదినము నూత్నప్రదేశములను జూచుచుండుటచేత దుఃఖము కొద్దిగా తగ్గెను. కొన్నిదినములు ప్రయాణము చేసి తుదకు సైనికులు రాజస్థానమున ప్రవేశించిరి. జస్వంతసింగు మార్వాడ్ దేశ ప్రభువు; అచ్చటికిఁ బోవలెనన్న మేవాడు రాజ్యముగుండఁ జనవలసి యుండును.

మేవాడు రాజ్యమందలి యనేక దుర్గములను గాంచి నరేంద్రుఁ డచ్చెరు వొందెను. సామాన్యముగా దుర్గములు పర్వతశృంగములపై నిర్మింపఁ బడియుండుటచే చప్పున పట్టుకొనుట శత్రువుల కసాధ్యముగ నుండెను. దుర్గము గిరికిరీటములవలె రమణీయముగా నుండెను. ఆదుర్గము లన్నిటి నధిరోహించుటకు మార్గములు లేవు; ఒక వైపున సోపానములవంటి బాట యుండును; దానివెంట జనులు రాకపోకలు చేయుచుందురు. యుద్ధకాలమున దుర్గములో తినుబండములు సంచితములగుచు. ఉన్న ద్వారము నొకదానిని మూయుదురు; పిమ్మట శత్రువు లేమి చేసినను దుర్గనివాసులు నిశ్చింతముగా నుండఁగలరు. వైరులు దుర్గము నధిరోహింప నుపక్రమించి నప్పుడు మీఁదినుండి బాలుప్రోవులు జాఱురును, అనేకులు నశింతురు.

ఇట్టి దుర్గములను గాంచుచు సైనికులు చివర కొకనాఁటి సాయంకాలమున చితోడు దుర్గమును సమీపించిరి. భటులు భోజనాదులు ముగించి తమతమ డేరాలలో విశ్రాంతి తీసుకొనుచుండిరి. నరేంద్రుఁడు కొద్దిమంది రాజపుత్రులలో చితోడు పర్వతము నెక్కి, దాని మీఁది దుర్గమున విచరింపఁ జొచ్చెను. ఆశ్చర్యాన్విత నేత్రములతో నతఁడు కుంభరాణా కట్టించిన చక్కని స్తంభమును, పద్మనీదేవి ప్రాసాద సరోవరములను, రాజపుత్రులు ఖడ్గహస్తులై మాటిమాటికి ప్రాణములు విడిచిన సింహద్వారమును, చితోడులోని రాజపుత్రాంగనలు చితు లెక్కి మానమును కులమునురక్షించినప్రదేశ మగు గుహను విలోకించెను.

వారియెదుట నొకవృద్ధుఁడు చప్పున నిలిచెను. రాజపుత్రులలో కొంద ఱాయన నానవాలు పట్టిరి. అతఁడు చితోడులోని వృద్ధచారణుఁడు. పూర్వకాలమున రాజస్థానమందు చారణకవులు రాజుల కాశ్రయముగ బాడి, రాజపురుషులకును నాగరికులకును సంతోషము కలిగించెడివారు. రాజస్థానమున నిప్పటికిని సంధ్యాసమయమున జనులు గుమిగూడి, చారణుని గీతములు వినుటకు వేచుకొనుచుందురు. పూర్వరాజుల యశోగీతముల నాకర్ణింప వారల నేత్రములు బాష్పకణములతో నిండిపోవును.

౧౯

ఆచారణుఁడు శైశవమందు మేవాడ్ దేశప్రభువు ప్రతాపసింహునిచేఁ బోషింపఁబడెననియు, చిన్నతనమునుండి యతఁడు ప్రతాపునితో పర్వతగుహాలయములందు నుపత్యకలయందును నివసించుచు నృపాలుని కీర్తిని కవితారూపమునఁ బాడుచుండెననియు నరేంద్రుఁడు మఱునాఁటి యుదయమున ననుసంధానముచేఁ దెలిసికొనెను.

ఢిల్లీచక్రవర్తితో ననేక యుద్ధములు చేసి తుదకు ప్రతాపుఁడు మృతినొందు నాఁటికి చారణున కిరువది సంవత్సరము లుండెను. ఇప్పటి కది యరువది యేండ్లనాఁటి సంగతి, కావున చారణుని వయస్సు రమారమి యెనుబది సంవత్సరము లుండును. అయినను, అతఁ డింకను చితోడుపర్వతమున రాత్రులందు సంచరించును. దైవబలముచే చారణుఁడు బలిష్ఠుఁడని యెల్లరు పలుకుచుందురు.

తనమరణ సమయమున ప్రతాపుఁడు తన కుమారుని అమరసింగును మంచము కడకు రప్పించి, తనవలె అమరసింగు గూడ మొగలులతో యుద్ధము నిరంతరము చేయునట్లును, మొగలులకు లోపడకుండునట్లును శపథము చేయించుకొనెను. తండ్రి యానతిని పరిపాలించుటకయి యమరసింగు అక్బరుతోను తత్పుత్రుఁడగు జహాంగీరుతోను యుద్ధము చేయుచు జనకునివలె పరా

క్రమము చూపెను. ఈయుద్ధము లన్నిటను చారణుఁడు సర్వదా రాణా వెంట నుండి, అన్ని వేళలందును ప్రతాపసింగును దృష్టాంతముగాఁ జెప్పుచు నాతని కుత్సాహము కలిగించుచుండెను; కాని, ఆయుత్సాహము విఫల మయ్యెను. అమరసింగు తుదకు జహాంగీరుకు లోఁబడెను; అయినను అది పేరునకు మాత్ర మనవచ్చును; అమరసింగే మేవాడ్ దేశపురాణా. ఆయన ఢిల్లీపాదుషాకుఁ బంపు కప్పము కంటె రెండురెట్లు పాదుషా ఆయనకు బహుమానరూపమునఁ బంపుచుండెను. అమరసింగు ఢిల్లీనగరమునకుఁ బోవనవసరము లేదు. ఆయన కుమారుఁడు కరణసింగును పౌత్రుఁడు జగత్సింగును జహాంగీరు, సమ్రాట్ షాజహాన్ సాదరముగా నాహ్వానించుచు, మణిమౌక్తికముల పారితోషికముగా నొసఁగి సంతోషపెట్టుచుండురు. అమరసింగును చారణుఁడు రాణాగా నెంచక, క్రోధాభిమానములచే కటూక్తులు పలికి, లేచిపోయెను. అమరసింగు లజ్జనొంది, తండ్రికిఁ జేసిన వాగ్దానమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని, సింహాసనము విడిచిపెట్టెను. అనంతరము కరణసింగు రాణా యయ్యెను.

అక్బరు చితోడు ధ్వంసము చేసినతరువాత ఉదేపూర్ అను పేర నీచక్కని రాజధాని నిర్మింపఁబడినది. కాని, ధ్వంస మయిన చితోడునందే చారణుఁడు నివసింపఁ జొచ్చెను. ఒకటి రెండు రోజులకు పైనుండి దిగి, క్రిందిగ్రామవాస్తవ్యు లిచ్చినవానిని భుజించి యాతఁడు మరల దుర్గమున కేఁగును. ఇవ్విధముగా నిర్జనస్థానమున నుండుటచే నాతఁ డున్మత్తుఁ డయ్యెను. పర్వతగహ్వరమాతని నివాసస్థాన మాయెను. మేఘముగర్జించినప్పుడును, ఝంఝూవాతముచే నరణ్యము కల్లోలమయినప్పుడును ఆతనికి మహోల్లాసము కలుగును. ప్రతాపసింగు అక్బరుతో యుద్ధము చేయుచున్నట్టులాతఁడు కలవరించును.

రాజపుత్రసైనికులు కొన్నిరోజులు ప్రయాణము చేసి, ఆరావళీ పర్వతములను దాటిరి. ఒకసారి భటులు పర్వతపాదముల వెంటఁబోవుచుండిరి. ఇరుపక్కల పర్వతరాశి తల యెత్తుకొని యు[illegible]శిఖరములు నభోమార్గమునుండి క్రిందికిఁ జూచుచున్నట్టు లుండెను. ఆశృంగములనుండి యనేక నిర్ఝరములు దూరమునకు వెండిరేకులవలెఁ గానఁబడుచు, సూర్యరశ్మిలో మిలమిలలాడుచు అంధకారమున నదృశ్యమగుచుండెను. సెలయేటినీరు క్రిందఁబడి, కొన్నిచోట్ల నదీరూపమునఁ బ్రవహించుచు, మఱికొన్ని ప్రదేశములందు నల్వంకల పర్వతము లుండుటచే నిర్మలసరోవరమువలెఁ గానిపించుచుండెను. సలిలము పరిశుభ్రమై నిశ్చలముగా నుండ, నాలుగుదిక్కుల నున్న పర్వతశిఖరముల ఛాయ దానిపై నిద్రించుచున్నట్లుండెను.

వేఱొకసారి సైనికులు రాత్రివేళ కొండత్రోవను బోవుచుండిరి. రెండుప్రక్కల పర్వతశిఖరములు చంద్రికా ప్రసారముచే కాంతిమంతములై యుండెను. అర్ధరాత్రమున నవి ప్రశాంతములై, సకలప్రాపంచిక వృత్తుల నణఁచి నిర్మలాంబరము దెస ముఖ మెత్తి ధ్యానమగ్నులై యున్న యోగులవలె నుండెను. ఆ ప్రశాంత విభావరి యందు రెండువైపుల పర్వతములపై నట్టిశోభను విలోకించుచు నగుచు నున్న మార్గమువెంట సుభటులు చనుచుండిరి.

కొండక్రింది భూములందును, కందరములందును ఆదిమనివాసులగు నసభ్య భిల్లులు నివసించుచుండిరి. భారతవర్షమునందలి యితర ప్రదేశములందు వలెనే రాజస్థానమందును సేద్యమున కుపయోగించు భూమిని ఖడ్గహస్తులగు నార్యులు వశము చేసికొనఁగా ఆదిమనివాసులగు భిల్లులు పర్వతగహ్వరముల నివసించుచున్నారు. వారు రాజస్థాన ప్రభువులకు లోఁబడి యుండలేదు; అయినను, మొగలులతో యుద్ధకాలమున ధనుర్బాణములు దాల్చి, పర్వతములపైకెక్కి, రాజపుత్రులకు చాల తోడ్పడుచుండిరి.

పర్వతములఁ దాటి జస్వంతసింగు శీఘ్రముగా తనదేశముఁ బ్రవేశించెను. మేవాడు మార్వాడ్ దేశములం జూచిన ప్రకృతిలీలాక్రమమున దేశములకు భేద మెంతవినట్లు కానఁబడును. మేవాడుదేశమునందు పర్వతములు, దివ్యవృక్షములు తీగెలు కలవు; మార్వాడు విపరీతముగా నుండును; పర్వతములులేవు, అశ్వత్థ వట ప్రభృతి బృహద్వృక్షములులేవు, ఉర్వర లేదు, జీవనదులు లేవు, పర్వతపరివేష్టిత జలాశయములు లేవు, కేవలము మరుభూమియందు వాలుకారాశి వ్యాపించియున్నది. కొన్నికొన్నితావుల ముండ్లచెట్లు చిన్నచిన్నవి కానఁబడును. ఈమరుభూమి మీఁదుగా సైనికులేఁగుసమయమున మేవాడుదేశీయభటులు "మా

కృష్ణకేశరాశిలో రత్నములు ధగధగ లాడుచుం డెను.

దూత నమస్కారము చేసి, మెల్లమెల్లన సభయముగా యావద్వృత్తాంతము నామెకు విన్నవించెను. పిడుగు పడుటకు ముందు నభోమండలమువలె రాణి యించుక సేపు నిశ్శబ్దముగా నుండి పిమ్మట నవకుంఠనము తొలఁగించి,ఆరక్తనేత్రములతో దూతదెస దృష్టి ప్రసారించి, «నీచా, నీమలినరక్తమును ఆసిప్రానదిలోఁ గలుపలేకపోతివా! నాయెదుటినుండి దూరముగా లేచి పో! తాను యుద్ధక్షేత్రమునుండి పలాయనము చేసి కళంకము దెచ్చికొనుటచే ఈపవిత్రదుర్గమునఁ బ్రవేశింప వీలు లేదని నీనీచప్రభువుతోఁ జెప్పు! ”అని పలికి మూర్ఛిల్లెను.

పరిచారికలు చాల యత్నము చేసి, రాణికి తెలివి తెప్పించిరి. అంతనామె కోపముచే నొడలు మఱచి యిట్లు పలుకసాగెను: «ఏ మంటివి? ఆయన యుద్ధక్షేత్రమునుండి పలాయనము చేసెననియా? పఱుగెత్తువాఁడు క్షత్రియుఁడు కాఁడు నాభర్త కాఁడు! ఈనేత్రము లింక జస్వంతసింగును జూడవు! నేను మేవాడ్ రాణా కుమారితను. ప్రతాపసింహుని వంశమునుండి వివాహమాడినవాఁడు భీరు వెట్లయ్యెను? యుద్ధమున విజయము నొందలేనిచో నెందుకు మృతి నొందలేదు దూతలు, ఇంకను నిలిచి యున్నారా? నాసైనికు లెచట నున్నారు? దూతలను పర్వతము మీఁది నుండి క్రిందికిఁ బడఁద్రోయుఁడు! దుర్గద్వారము మూయుఁడు!”

రాణిశరీర మంతయు వణఁకుచుండెను, శోకమున కంఠము రుద్ధ మయ్యెను, ముఖమండలము శోణ మయ్యెను. నరేంద్రుఁ డంతట ముందునకుఁ జని మెల్లమెల్లన గంభీరస్వరముతో నిట్లనెను: “మహారాజ్ఞీ, మామరణమున కాజ్ఞ యిచ్చితిరి. మేము మరణమునకు భయపడము. జస్వంతసింగు మహారాజుగారిని మాత్రము నీచుఁడనవలదు. వారు యుద్ధము చేయుచుండ నే నీకన్నులతోఁ జూచితిని. నేను జీవించి యున్నంతకాల మట్టి భయంకర యుద్ధము నెన్నఁడు చూడను, అట్టి యద్వితీయ పరాక్రమము చూడను!”

రాణి యించుక నిశ్చలదృష్టితో నరేంద్రుని వంకఁ జూచి, యిట్లనెను: «యథార్థముగా ఆయన [illegible] యుద్ధము చేసెనా? నీవు విదేశీయుఁడవు. నీప్రాణములకు భయము లేదు. నిజమైన వృత్తాంతము విస్తరించి చెప్పుము.”

నరేంద్రుఁడు యుద్ధమును విపులముగా వర్ణించెను, రాజపుత్రసైనికుల పరాక్రమమును, మహారాజుగారి విక్రమమును తాను జూచిన రీతిని అభివర్ణించి, తుద కతఁ డిట్లు విన్నవించెను. “మేఘరాశివలె మొగల్ సేన వచ్చి యాక్రమించినప్పుడు, ధూళిధూమములచే యుద్ధక్షేత్ర మంధీభూతమయినపుడు, భీరువు కాసింఖాన్ పలాయనము చేసినపుడు మహారాజుగారు రాజపుత్రోచితసాహసము నవలంబించి యుద్ధము చేసిరి. నాల్గుదెసల రాజపుత్రరక్తముతో పర్వతపాదము, సిప్రానదియు రంజితము లయ్యెను. ఔరంగ్ జేబు, మురాదును వేలకొలఁది మొగలులతో మహారాజుగారిపైఁ బడిరి: వారు విక్రమముతో పోరిరి. వారిపాదసన్నిధిని వందలకొలఁది రాజపుత్రులు నిహతులగుచుండిరి, సంఖ్య క్షీణించుచుండెను. మొగలుల జయనినాదముతో భూమ్యాకాశములు వణఁకఁజొచ్చెను, కాని మహారాజుగారి హృదయము చలింపలేదు. ఎనిమిదివేల రాజపుత్రులలో ఎనిమిదివందలమంది జీవించిరో లేదో! అయినను మహారాజుగారు యుద్ధభూమి విడవలేదు. వారిపరాక్రమమునకు ఘోరరక్తస్రోతస్వతి యగు సిప్రానదియును, భయంకర మైన వింధ్యపర్వతమును సాక్షులు!”

ఈవాక్యముల నాలకింప రాణి నేత్రయుగమున జలజల నీరు గాఱెను. ఆమె యిట్లనెను: «భగవన్, నీకు నమస్కారము! నాభర్త రాజపుత్రనామము నిలిపెను. విదేశీయదూతా, ఈమాటలచే నాహృదయము శాంతించినది. అటుతరువాత నేమయ్యెనో చెప్పుము.”

«మానవుల కేది సాధ్యమో, రాజపుత్రుల కేది సాధ్యమో జస్వంతసింగు మహారాజుగారు అది యంతయు నెరవేర్చినారు. కేవల మయిదువందల సైనికులు మిగిలి యున్నప్పుడు వారు రణరంగము విడిచిరి ”

«పలాయనము చేసినారా? హా, విధాతా! రాణా జామాత పలాయనము చేసెనా?” అని వక్షముపై గాఢముగా మోఁదుకొని రాణి క్రమ్మఱ మూర్ఛిల్లెను.

తోడనే పరిచారికలు రాణిముఖమున జలసేచనము చేసిరి. త్వరలోనే తెప్పిలి యామె కటకటా

స్వరముతో, "పరిచారికలారా, ఛితి పేర్వుడు. నాభర్త యుద్ధక్షేత్రమున మృతినొందెను. ఆయన నాకోసము స్వర్గమున నిరీక్షించుచుండును. నే నచ్చటికిఁ బోయెదను. ఆయన పేరిట వచ్చిన వాఁడు ధూర్తుఁడు. దూతా, నీసహచరులతో శీఘ్రముగా మార్వాడ్ దేశము విడిచి పొమ్ము; కానిచో మరణ దండనము సంభవించును!" అని యాక్రోశించెను.

నరేంద్రుఁడు తోడివారలును దుర్గమునుండి నిష్క్రమించిరి. రాణి యానతిచొప్పున దుర్గద్వారము రుద్ధమయ్యెను. దూతలు బయటికిఁ జను నప్పుడు జోధపురమంత్రి యొకయుత్తర మిచ్చి యిట్లనెను: "మహారాజుగారిని మీరు చూడవలసిన పనిలేదు. ఈపత్రికను దీసికొని శీఘ్రముగా మేవాడురాజధాని యగు ఉదేపూరునకుఁ జని రాణారాజసింగుగారి కొసఁగుఁడు. వారు మీ కాశ్రయ మొసఁగుదురు. మామహారాజ్ఞిగారి యానతి యలంఘనీయము; మీరు మార్వాడ్ దేశమున నుండుటకు వీలులేదు. రాణిగారి తల్లి కీపత్రిక యందిన తోడనే యామె జోధపురమునకు వచ్చును. తల్లితప్ప కూఁతురి నూరడించువారు లేరు."

జోధపురరాజ్ఞి యెనిమిది తొమ్మిదిరోజులు ఉన్మత్తప్రాయయై యుండె నని చరిత్రము లిఖింపఁబడి యున్నది. తరువాత ఉదేపూరునుండి యామె తల్లి వచ్చి, పుత్రికను శాంతపఱచెను. అప్పుడు రాణి భర్తను సందర్శింప సమ్మతించెను. మరల సైన్యము సమకూర్చుకొని, జస్వంతసింగు ఔరంగ్ జేబుతో త్వరలో యుద్ధముచేయు నట్లు స్థిర మయ్యెను.

౨౦

మేవాడు దేశమునకు చితోడు పూర్వము రాజధాని, ప్రస్తుతము ఉదేపూరు. మార్వాడ వాలుకారాశినుండియు, మరుభూమి నుండియు పర్వతసంకుల మైనమేవాడదేశమునకు తిరుగ వచ్చి, నరేంద్రనాథుఁడు మిగుల నానంద మనుభవించెను. క్రమ్మఱ నతఁడు ఆరావళ్యున్నతశిఖరము నెక్కెను, పర్వతనదీ ప్రస్రవణవేగమును సందర్శించెను, శాంత నిశ్చలగిరి ప్రదశోభ నాలోకించెను. నరేంద్రుని హృదయమున సంతోషోదయ మయ్యెను, కొన్నిరోజు లివ్విధమున సంచరించుచు నతఁడు, దూతలును ఉదేపూరు చేరిరి.

అట్టి రమణీయప్రదేశమున నట్టి సుందరనగరము నరేంద్రు డెన్నఁడును జూచినట్లు తోఁచలేదు. క్రింద, శాంతనిశ్చల సరోవరమును నిర్మలాకాశమును నలుదిక్కుల పర్వతశ్రేణీప్రతిబింబమును సమస్పష్టముగా తమయందు దాల్చుచుండెను. నాలుగువైపుల చక్కని మహాభగములనై మహీధరములు బలిసియుండెను ఇట్టి చక్కని యున్నత ప్రాకారముతో ప్రకృతిదేవి ఆసుఖ ప్రదేశమును సంరక్షించుచున్నట్లుండెను. సరస్సు సమీపమున నొకగిరిశ్రేణిమీద చక్కని ప్రాసాదము, ధవళసౌధ పంక్తులును మందహాసవదనముతో నిర్మల దర్పణమున నిజప్రతిబింబమును విలోకించుచున్నట్లుండెను.

సూర్యద్వారము గుండ జోధపురదూతలు నగరములోఁ బ్రవేశించిరి. జోధపురమునకు ఉదేపురమునకు అస్వాభావికసఖ్య ముండుటచే దూతలకు స్వాగత మిచ్చుటకయి నాగరకులు జయధ్వనులు చేయఁజొచ్చిరి. పరిష్కృత మార్గమువెంట నరేంద్రుడు నతని సహచరులును ప్రాసాదాభిముఖముగాఁ జనుచుండిరి. చారణులు మంగళగీతములు పాడుచుండిరి. కలశము లెత్తుకొని యిరువైపుల స్త్రీలు నిలిచి యుండి ఆనందగీతములు పాడుచు జోధపురదూతలను గౌరవించిరి ఒకటిరెండు నాగరికులచొప్పున సందఱకు బహుమానము లిచ్చుచు దూతలు సంతుష్టి కలిగించుచుండిరి.

పిమ్మట వారు ప్రాసాదమును బ్రాపించి, రాణాయానతి చొప్పున లోపలఁ బ్రవేశించిరి. శ్వేత పాషాణ సోపానముల నారోహించి వారు సూర్యమహాలులోని కేగిరి. రాణా ఆమహాలులోనే విదేశీయ దూతలకు దర్శన మిచ్చును. ప్రభువంశమున కాదిపురుషుఁడగు సూర్యుని విగ్రహము చెక్కించి అందొకవైపున నుంచుటచేతనే దానికి సూర్యమహాల్ అను పేరువచ్చెను.

రక్తవర్ణవస్త్ర మండితము, బహుమూల్యరత్నఖచితమునగు సింహాసనముపై బప్పారావు వంశావతంసుఁడగు మహారాణా రాజసింగు ఉపవేశించియుండెను. నాలుగువైపుల స్వర్ణఖచిత రజత స్తంభములమీఁది చాందినీయందు మణిమౌక్తికములు ప్రకాశించుచుండెను. కొంచెము దూరముగా పారిషదులు కూర్చుండి యుండిరి. అమరావతీ (సుధర్మ) సదృశమగు రాజసభయందు చాడ

ణులు స్తుతిపాఠములతో రాణాను ప్రశంసించుచుండిరి. ఇయ్యవసరమున జోధపురదూత లేతెంచిరి.

వినయముతో దూతలు సమస్త వృత్తాంతములను రాణాకు విన్నవించిరి; జస్వంతసింగు పరాజయము, దేశమునకు మరలి వచ్చుట, రాణికోపము, రాజుదుర్దశ— ఈవిషయముల నన్నిటిని దెలిపి, జోధపుర మంత్రి పంపిన పత్రికను రాణాకు సమర్పించిరి. రాణారాజసింగు అన్ని సంగతులు తెలిసికొని, జస్వంతసింగుకయి విచారము చూపి, దూతలకు సెలవొసంగెను; ఉదేపూరులో నుండుటకు వారికి తగినచోటు ఏర్పాటుచేయవలె నని మంత్రి కాజ్ఞయిచ్చెను. కొద్దిరోజులలో జోధపూరు రాణితల్లి ఉదేపూరునుండి జోధపురమున కరిగెను.

నరేంద్రనాథుఁ డుదయపురమున కొన్ని మాసములుండి, మిగుల నానంద మొందెను. హేమలతా ప్రతిమూర్తి ఆతనిహృదయమున గాఢముగా అంకితమై యుండెను; ఆమెతలంపులు మరలిపోవుట లేదు. అయినను, రమణీయమైన యీయుపత్యకయందు నివసించు సమయమున ఆతలంపులు కొంచెముగా తగ్గినవి. ఉదేపూరునుండి కొంచెము దూరమున ననేకయుద్ధక్షేత్రములు, జయస్తంభములు, పవిత్రభూములును కలవు. ఒక్కటొక్కటిగా నతఁ డన్నిటిని సందర్శింపఁ జొచ్చెను. ఒకొక్కప్పు డేకాకిగను, వేఱొకప్పుడు ఉన్మత్త తాంత్రికబాలునితోను నరేంద్రుఁడెన్నో పర్వతముల నెక్కెను, హ్రదముల నీక్షించెను, బహుప్రదేశముల సంచరించెను. అప్పుడప్పుడు ప్రాతఃకాలమునుండి మధ్యాహ్నము వఱకును, అపరాహ్ణమునుండి సాయంకాలము వఱకు నరేంద్రుఁడు పరిభ్రమించుచుండును. ఉదేపురమున క్రీడాసక్తులగు రాజపుత్ర బాలకులు ప్రభాతమున ఆక్రొత్త యాత్రికుని వెఱ్ఱివానిఁ జూపుచుందురు. సాయంకాలమున రాజపుత్రాంగనలు మడుగునుండి నీటిబిందెలు తీసికొని మరలివచ్చునపుడా విదేశీయుని జూచి బాలకుఁడని యెంచి, నమస్కరించి పోవుచుందురు.

తాంత్రికబాలుఁడు నిశ్శబ్దముగా తనయజమానుని వెంట సంచరించుచుండును; చెంతనున్న వృక్షములనుండి ఫలములు దెచ్చును; సాయంకాలమున పడవకు తానే తెడ్డువేసి, యజమానుని ఉదేపూరునకు మరలఁ దీసికొని వచ్చుచుండును. ప్రశాంతసరస్సుపై పడవ కేలియాడుచుండు వేళ సంధ్యాసమయమున నభోమండలమును, ఉత్తుంగమహీధరములను, నిర్మల సరోవరమును వీక్షింప నరేంద్రుని హృదయము శాంతిసంపూర్ణ మగును. అప్పుడప్పుడు తాంత్రికబాలుఁడు స్వప్రయత్నమున గానము సేయ నారంభించును. గీతము తాంత్రికభాషయం దుండుటచే దాని యర్థము తెలియక పోయినను ఒకటి రెండు మాటలవలన నది ప్రణయగీతమని నరేంద్రునకుఁ దెలియుచుండును. పాపము! ఉన్మత్త బాలుఁడా, నీ వీవయస్సునకే ప్రేమోన్మత్తుఁడ వయితివా? కానిచో, పిచ్చివాఁడవు కానేల? నేత్రములయం దస్వాభావిక తేజముండుటేల? గృహమును, దేశమును విడిచి, దేశదేశములందుఁ దిరుగ నేల? పిచ్చివాఁడు నరేంద్రునకుఁ దగినసేవకుఁడు!

రాత్రివేళ వెన్నెలలో హ్రదమునకు వన్నె వచ్చును; తరంగములపై చంద్రకిరణములు రమ్యముగా నాట్యమాడును; మందమారుతము తరంగమాలికను ముద్దాడును. నరేంద్రుఁడు పడవలోఁ బండుకొని, నల్వంకలనున్న పర్వతరాశిని విలోకించును, ఆకాశనీలచ్ఛవిని గాంచును, పాలనురుగువంటి తెలిమబ్బుల నొకటి రెంటిని జూచును. వీని నన్నిటిని విలోకింప, నతనికి చిన్ననాఁటిసంగతులు జ్ఞప్తికి వచ్చును; హేమలత జ్ఞాపకము వచ్చును. అతని ముఖము అలక్షితబాష్పబిందుసంసిక్త మగును.

ఇవ్విధమున కొన్ని నెలలు గడచెను. క్రమముగా ఆశ్వయుజమాసమున అంబికాపూజాసమయ మాసన్న మయ్యెను.

౨౧

శరత్కాల మేతెంచెను. రాజస్థానమున నిది యుద్ధారంభసమయము, కావున అంబికాపూజతో ఖడ్గపూజకూడ జరుగును. ఆశ్వయుజమాసమున పదిరోజులు నరేంద్రుఁడు చూచిన కోలాహలమును వర్ణింప నక్కఱలేదు. పూర్వ్వ లేశస్త్రములు గొని యుద్ధములందు జయమునుగాని మరణమునుగాని పొందిరో ఆశస్త్రములను యోధులు మహోత్సాహముతో నాయుధశాలలనుండి బయటికిఁ దీసి, కలకలముతో వానిని బూజింపఁజొ

చ్చిరి. దేవీమందిరమున ప్రతిదినము మహిషములను, మేకపోతులను బలియిచ్చుచుండిరి. పదియవ నాఁడు సంరంభముతో దుర్గాపూజ జరిగెను. సేవ వారు తోరణము మహారాణా యోధుల నెల్లర నాహ్వానించి, రంగస్థలమునకు జేరెను. ఆనాఁడు ఉదేపూరు నూతన శోభతో వెలుగొందెను. బజారు, దుకాణములు, మార్గములు, గృహములు పుష్పమాలికలతోను తోరణములతోను శోభిల్లుచుండెను. ఇంటింటికడను చక్కని తోరణములు కట్టఁబడి యుండెను, విజయపతాకము లెగురుచుండెను. ప్రాతఃకాలమున ధర్మానిసాగరమున రాజపుత్ర సైనికులు సంసిద్ధులై రంగస్థలమునకుఁ బోవుచుండిరి. ఉదేపూరునకు లోఁబడిన నానాప్రదేశములనుండి చాలమంది సేనాధిపతులు తమతమ సేనలతో వచ్చి చేరిరి. చాల తావులనుండి యెందఱో జనులు బహువిధ వేషభూషలతోను, ఆయుధములతోను ఉదేపూరు వచ్చిరి. పదునైదువేల సైనికులు మహారాణాను పరివేష్టించి యుండిరి. వారల పదభరముచే మేదిని కంపించుచున్నట్లుండెను.

గాంభీర్ ప్రొద్దెక్కినది మొదలు సాయంకాలము వఱకును రంగస్థలమున సైనికులు గుమిగూడి యుండిరి. వారల యుద్ధకౌశలము నవలోకించుచు నగరవాసు లొకరినొకరు త్రోసికొని పోవుచుండిరి. రాణాయాజ్ఞానుసారముగా సైనికులు బాణములు విడుచుచు, బల్లెములతోను, ఖడ్గములతోను పోరుచు, గుఱ్ఱములను బలుగ త్తించుచు తమతమ నేర్పు చూపుచుండిరి. మేవాడు రాజ్యమంతటిలి వివిధ ప్రదేశములనుండి వచ్చినపలు తెగల రాజపుత్రులు తమతమ రణకుశలతను బ్రదర్శించుచుండిరి. చోండావత్ గజావత్ ప్రమార్ ఝూలా మొదలగు వంశముల రాజపుత్రులు నేఁడు ఉదేపూరులో రాణాసన్నిధిని రాజభక్తిని రణపటుత్వమును జూపవచ్చిరి. మఱియు చారణులా యావంశముల యశోగీతములను బాడుచుండిరి. నరేంద్రుఁడు విస్మయముగా దినమంతయు సమరోత్సవము జూచి చారణుల గీతముల నాలకించి పులకితచిత్తుఁడయ్యెను. నేటికిని రాజస్థానమున నిట్టియుత్సవము జరుగును, నేటికిని రాజపుత్రవీరులు ఈసమయమున తమతమ ప్రభువుల సన్నిధిని యుద్ధకౌశలమును జూపుచున్నారు. ఇప్పటికిని నాగరకులు దేవీపూజావసానమున దేశీయప్రభువుల యెడభక్తిని జూపుచుందురు.

దినమంతయు నీయుత్సవముల నవలోకించి నరేంద్రుఁడు సాయంకాలమున సొగచెట్టుకిందికి బోయి, కొంచెము ఫలాహారము చేసి, చెంతనున్న యొకబావినుండి నీరము తెచ్చికొనఁబోయెను. బావికడ గోసాయి యొకఁడు నిలువఁబడి యుండెను. అతఁడును నీటికొఱకు వచ్చినవాఁడే. ఆగోసాయి మోటుగా నరేంద్రుని నెట్టి, ముందు తాను నీరుతోడుకొనఁ జొచ్చెను. గోసాయి చేసిన యీ మోటుపనికి నరేంద్రుఁడు కుపితుఁడై యతనిని దిరస్కరించెను. గోసాయి ద్విగుణముగా కటూక్తులతో నరేంద్రుని దిరస్కరించి యిట్లనెను

"నీవు విదేశీయుఁడవు! రాజస్థానమునకు వచ్చి రాజపుత్రులతో కలహము నారంభించుటకు నీకు జంకు లేదా!"

"నేను విదేశీయుఁడనే. కాని, బహుకాలము నుండి రాజపుత్రులతో సహవాసము చేయుచున్నాను. నీవంటి మోటువానిని జూడలేదు."

"రాజపుత్రులతో సహవాసము చేసి యుంటివేని, రాజపుత్రుఁడైనవాఁడు కత్తి, డాలు పట్ట నేర్చియుండు నని తెలిసికొని యుందువు వలెనే. కాబట్టి, ఊరకుండుము!"

"గర్విత రాజపుత్రా, నేనుగూడ కత్తిని, డాలును బట్టఁ గొంచెము నేర్చియున్నాను. నాకడ డంబములువద్దు. నీవు గోసాయివని యీ పర్యాయము క్షమించినాను."

మాటపై మాటమీఁద వివాదము విజృంభింపఁ జొచ్చెను. గోసాయి మిక్కిలి కోపముతో నరేంద్రుని గొట్టెను. నరేంద్రుఁడును గోసాయిని ప్రహరించెను. కొంచెము సేపటిలో నిరువురు పొడ లెత్తుఁగల కత్తులు దూసిరి. అప్పటికి చీఁకటి పడెను. అచ్చట మఱెవ్వరును లేరు.

ఈపర్యాయ మిరువురు తీవ్రముగా యుద్ధమారంభించిరి. ఒకరి కొకరు సరిగాఁ గానఁబడలేదు. త్వరలో నరేంద్రుఁడు ఓడిపోయెను. అపూర్వబలవంతుఁడగు గోసాయి వ్రేటునకు నరేంద్రుని డాలు భిన్నమయ్యెను, ఖడ్గము చేతినుండి జాఱెను, అతఁడు నేలపై నొరగెను.

గోసాయి కఠోరస్వరముతో నిట్లనియె. "విదేశీయ యోధా, నీవు చిన్నవాఁడవు, నీయపరాధము క్షమించినాను; మఱల రాజపుత్ర గోసాయితో కలహింపవద్దు. గోసాయి తనజీవి

తమ దేవతార్చన యందే గడపుట లేదు, కొంచెము యుద్ధము కూడ నెఱుఁగుదు."

"రాజపుత్రా, నేను నిన్ను జీవనభిక్షు వేడను. నీయిచ్ఛ వచ్చినట్లు సాధ్యమైనది చేయుము. నీయనుగ్రహము వేడను," అని నరేంద్రుఁడు కర్కశస్వరమునఁ బలికెను.

అంతట గోసాయి గంభీరముగా నిట్లనెను: "యోధా, నేనుగూడ యుద్ధము నేర్చియుందును యోధను యాచించినచో యోధ కవమానములేదు. నరేంద్రా, నేను నిన్నెఱుంగుదును, నీవును నన్ను శీఘ్రముగాఁ దెలిసికొనఁ గలవు. నాకడ భిక్షు పరిగ్రహించుట యవమానముకాదు. మూఁడు రోజులలో మరల నేను కానఁబడెదను. ఆనాఁడు నేను గూడ నిన్నొకటి యాచించెదను. నన్ను నైతేశ్వరుఁ డందురు."

అని పలికిన గోసాయి సత్వరముగా చీఁకటిలో నదృశ్యుఁ డయ్యెను. నరేంద్రుఁడు విస్మయముతో నిలిచియుండెను.

౨౨

రాజస్థానమునందు క్రొత్తక్రొత్తప్రదేశములను, ఆచారవ్యవహారములను జూచి నరేంద్రుని హృదయము శాంతి నొందెను; కాని ఛాతిమీఁదఁ జెక్కిన గుఱుతు ఒక్కమాఱుగాఁ బోవదు. వంగదేశమునుండి ఉదేపూరునకు మధ్యదూరములో ఎన్నోనదులు, పర్వతములు, మరుభూములు దాఁటి నరేంద్రుఁడు భారతవర్షపు తూర్పు సరిహద్దునుండి పడమటి హద్దునకు రమారమిగా వచ్చియుండెను. అయినను, ప్రాతఃకాలమున పూర్వాకాశమందు అరుణకాంతి దృగ్గోచరమయినప్పుడు పూర్వదేశవాసిని యగు కన్య నరేంద్రుని హృదయమున మెలఁగును. రాత్రి నరేంద్రుఁ డొంటరిగా మేడమీఁద చీఁకటిలో విచరించునప్పుడు ఆప్రణయ విగ్రహము చుక్కవలె నతనిదెస ననురాగవీక్షణములు ప్రసారించుచున్నట్లు తోఁచుచుండెను. వీరనగర హర్మ్యమెక్కడ? కలకలనినాదిని భాగీరథి యెక్కడ? మతి నరేంద్రనాథుఁ డెక్కడ? స్వదేశమునుండి తాను పలాయనము చేసినను తలఁపులనుండి పలాయనము చేయఁగలుగునా? మరణమునకు పూర్వమొకసారి యాహేమలతను జూచి, త్రికాలములయందు తాను జేయు నాలోచన లన్నియు నామెతోఁ జెప్పవలెనని యతని కోరిక. మరణమునకుఁ బూర్వ మామె సందర్శన మొకసారి లభించునా? ఏకలింగ మందిరమున నొక గోసాయి భవిష్యత్తు చెప్పునని నరేంద్రుఁడు తార్తారునివలన వినెను. ఆదేవాలయమునకు నరేంద్రుఁ డొకనాఁ డరిగెను.

రేయి జాము ప్రొద్దు పోయిన పిమ్మట నరేంద్రుఁడు దేవాలయములోఁ బ్రవేశించి, దానిశోభకచ్చెరు వొందెను. ఆలయము పర్వతపాదమున నిర్మింపఁబడినది. దానికి నల్వంకల కనుచూపుమేరలో పర్వతరాశి యంధకారమున నాకాశములోఁ గలిసిపోయెను; ప్రకృతి దుర్లంఘ్య ప్రాకారమును నిలిపి, రుద్రుని కనురూపమైన గృహమును నిర్మించెనో యను నట్లుండెను.

అర్ధరాత్రిమున నరేంద్రుఁ డా పెద్దదేవాలయమునఁ జొచ్చెను; తెల్లరాతితోఁ జెక్కిన చక్కని స్తంభశ్రేణి నడుమగా నాతఁడు విస్తీర్ణశిలామందిరమునఁ బ్రవేశించెను. ఎదుట మహాదేవుని నందియొక్క యిత్తడి విగ్రహముండెను. లోపల పరిశుభ్రప్రకోష్ఠమున, స్తంభములమీఁద సుగంధతైలదీపములు జాజ్వల్యమానముగా నుండెను. నడుమ భోలనాథుని శిలావిగ్రహము ప్రతిష్ఠితమైయుండెను. ఆలయమున దీర్ఘకాయుఁడు, తేజస్వి, జటాధారియు నగు గోసాయి ఒక దిక్కున నుపవేశించియుండెను; ఫాలమున నర్ధచంద్రరేఖవలె చందనరేఖయు, విశాలస్కంధమున యజ్ఞోపవీతము నుండెను. మఱిముగ్గురునలుగురుగోసాయీలు ఇటునటుఁ దిరుగుచుండిరి. ఈయాలయపు ముఖ్యగోస్వామి అవివాహితుఁడుగా నుండును. ఆయన మరణించిన పిమ్మట శిష్యులలో నొకఁడు ఆపదవి నొందును. దేవాలయపు వ్యయములకై చాలగ్రామములు కలవు, ఇంతేకాక యాత్రికులదానములును మిక్కుటముగా నుండును.

అర్ధరాత్రిపు ఘంటారవ మాసుందరమందిరమునఁ బ్రతిధ్వనించెను. ఓంకార శబ్దముతో దేవాలయము నిండిపోయెను. పిమ్మట, వాద్యసమ్మిళితోచ్చ గీతారవముతో భోలానాథ స్తవము ప్రారంభమయ్యెను. యౌవనసంపన్నలగు ప్రౌఢనాట్యాంగనలు నియతితో నృత్యము చేయఁజొచ్చిరి

గాయకులు సప్తమస్వరమున మహాదేవుని స్తోత్రము చేసిరి, కొంచెము సేపటికి గానము ముగిసెను. జటాధారి యగు గోసాయి సంజ్ఞ చేయుటచే నాట్యాంగనలు వెడలిరి, గాయకులు [illegible] లయిరి, మందిరమున దీపములు నిర్వాపితము లయ్యెను, పూజ ముగిసెను. నరేంద్రుఁ డాచీకటిలో కర్తవ్య మెఱుఁగక నిలిచియుండెను. కొంచెము సేపటికి కాజటాధారి గోస్వామి చీకటిలో రమ్మని సంజ్ఞ చేసినట్లుండ నరేంద్రుఁ డావంక కరుగఁజని, 'తాము ఈ దేవాలయములోని గోస్వాములేనా?' అని ప్రశ్న చేసెను. గోసాయి యెంతమాత్రము మాటాడక, పెదవిపై వ్రేలుంచికొని, తన వాత వ్రేలితో నొకవైపు నరేంద్రునికి జూపెను. నరేంద్రుఁ డాదిక్కు చూడ కటికిచీకటి తప్ప నింకేమియు గానఁబడలేదు; మరల వీక్షింపఁగా నా యంధకారమున నొక దీపశిఖ గోచరమయినట్లయ్యెను. గోసాయి నరేంద్రునకు సంజ్ఞ చేసి, ముందున కేఁగుచుండెను, నరేంద్రుఁ డేమియు గ్రహింపనేరక యాతని వెనువెంట నరుగుచుండెను.

ఆ చీకటిలో నిరువురు చాలదూరము నడచిరి. అంధకారము మౌనధారియగు నీరాగి యెవ్వరు? ఈయన యభిప్రాయమేమి? శైవులు పూజకై యప్పుడప్పుడు నరహత్య చేయుచుందురు: దీర్ఘకాయుఁడు, బలిష్ఠుఁడునగు నీవికటయోగి యుద్దేశ్య మట్టిదనియేనా? నరేంద్రుఁ డొకపర్యాయము నిలిచి ఖడ్గముపై జేయివైచి నేను కాపురుషుఁడను! ఈ ప్రశాంతమూర్తి వెంటఁబోవ భయపడుచున్నా నేమి అని భావించి మరల గోసాయితో నా చిమ్మచీకటిలో నడువ జొచ్చెను.

కొంతసేపటికి కాశైవగోస్వామి పర్వతగహ్వరములో బ్రవేశింప నరేంద్రుఁడుఁగూడ నందు బ్రవేశించెను. అందు జూచినదానికి నరేంద్రుఁడు మత్యంత యాశ్చర్య మొందెను.

ఎదుట కరాళవదన యగు కాళీదేవి విగ్రహముండెను, సమీపమున కట్టె మండుచుండెను, ఆ కాంతి గుహలో నల్వంకల నున్న శిలలపై బ్రతిఫలించుచుండెను. అగ్నిప్రక్కన కొన్ని క్షురములు, రక్తసిక్త ఖడ్గము నుండెను; అక్కడక్కడ శిలాఖండములు రక్తరంజితములుగా నుండెను. దూరమున జలప్రవాహమువంటి ధ్వని వినవచ్చుచుండెను.

గోసాయి యాకార మపూర్వముగా నుండెను. కొంచెము నెరసిన గడ్డము ఱొమ్మువఱకు వ్రేలాడుచుండెను, జడలు వీఁపుపై వ్రేలుచుండెను. శరీర మున్నతము, బలిష్ఠము, తేజోవంతము నని తోచుచుండెను. నేత్రద్వయము మహాగ్నివెలుతురులో తళతళలాడుచుండెను. ఉన్నతలలాటమున నర్ధచంద్రాకారమున సన్నచందనరేఖ ప్రకాశించుచుండెను.

మండుచున్న కాష్ఠము నార్పి గోసాయి దాని కావలనున్న రక్తసిక్తఖడ్గమును దీసికొనెను. వికీర్ణస్ఫులింగములచే నాయన ముఖమండలము, దీర్ఘావయవములును వికృతముగాఁ గానఁబడుచుండెను. నరేంద్రునిహృదయము స్తంభీభూత మయ్యెను; విధిలేక యతఁ డొక యడుగు వెనుకకు వైచి, పాషాణముల నానుకొని, కత్తిదూసి, పరాక్రమమును నమ్మి, స్థిరముగా నిలిచెను. అయినను, అతని హృత్కంపము మాత్ర మొక్కసారిగా శాంతింపలేదు.

అత్యంత గంభీరధ్వనితో గోసాయి, "నరేంద్రనాథా!" యనెను.

ఆ శైవుఁడు ఉదేపూరయోధ యగు శైలేశ్వరుఁడని నరేంద్రుఁడు తోడనే గ్రహించెను.

౨౩

"నరేంద్రనాథా, భగవాన్ ఏకలింగేశ్వరుని దేవాలయమునందు గోసాయీలకు మానవహృదయమును గ్రహించుశక్తి కలదు. నరేంద్రనాథా, నీవు పాపహృదయముతో నీమందిరము ప్రవేశించితివి. నీమానసమున పాపచింత యున్నది."

"మీరెవరో తెలియదు, కాఁబట్టి మీప్రశ్నమునకు సమాధానము చెప్పవలసిన యవసరము లేదు."

"నేను భగవాన్ ఏకలింగజీ యాలయమునందు గోస్వామిని. మందిరమును కళంకితము చేసినవానిని ప్రశ్నించుటకు నాకధికారము కలదు.

"మీరు నన్నెట్లు గుర్తుపట్టినారో తెలియదు నాలో ఏమిపాపమును గనిపెట్టినారో యెఱుకలేదు."

"ఈ మందిరమున మోసముతోఁ బనిలేదు. ఒక రమణిని ప్రేమించి యామెను పొందు కోరి

కథలో నీవిచటికి వచ్చియున్నావు."

"ఇవేమో దోష మేమున్నది? గోసాయీలు స్త్రీని పేరు తెలియఁగకపోయిన మాత్రాన, ప్రేమించుట పాపము కాదు. సాక్షాత్ శూలపాణి యంతటివాడు అపర్ణను ప్రేమించెను."

"నరేంద్రా, మోసము చేయఁదగిన చోటు కాదిది. నీవు కేవల స్త్రీని ప్రేమించినవాఁడవు కావు పరస్త్రీని ప్రేమించినవాఁడవు. ఈపాపమునకుఁ బ్రాయశ్చిత్తమగుటకు లోకమున తగినశాస్త్రి యున్నదా! నరకమున తగిన యగ్ని యున్నదా?

"నేను ప్రేమించి నప్పుడామె యవివాహిత; ఆమెకు వివాహమయినచో నిప్పుడామె అస్పృశ్యనీయ."

"నరేంద్రనాథా, భ్రాంతి పడకు, నన్ను పొరపెట్టుటకు యత్నింపకు. నీ వెంత ఘోరపాపమున మునిఁగి యుంటివో చక్కఁగా నాలోచింపుము. మనోహర గంగాతీరమునందలి యారమ్య హర్మ్యమును జ్ఞప్తికిఁ దెచ్చికొనుము. శ్రీశచంద్రుఁడు పవిత్రాత్ముఁడు హేమలత పవిత్ర హృదయ. వారిది పవిత్రసంసారము! దుర్మార్గుఁడా, నీ కోరిక యేమి; ఆకుటుంబము పాడుపడి శ్రీశచంద్రుఁడు నాశము చెంది, హేమలత నీకు లభింపవలెనా! చిన్నతనమున నీతో నాటలాడి ఇప్పటికి నిన్ను సహోదరునివలెఁ బ్రేమించుచు, నీకై చింతించుచున్న పుండరీక సన్నిభ, పవిత్రహృదయ, స్నేహమయి, పతివ్రత, హేమలత కులటయై నీకు సేవ చేయవలెనా? నీమూలమున పతివ్రత ముఖమున కులపాంసని, దుశ్చారిణి యను శబ్దములు తుడిచి వేయుటకు వీలు లేకుండ ముద్రితము లగును; పాల నురుగు వలె శుభ్రమైన యామెకీర్తియందు బొగ్గురంగు దేదీప్యమానమగును; బంగారమువంటి కుటుంబము చెల్లాచెదరగును! నరేంద్రనాథా, భ్రాంతిపడకు: ఇంతదూరము నీవు తలపోయలే దనుట నిక్కమే. కాని నీమనోరథము కొనసాగునేని ఇంతకంటె వేఱు ఫల మేమున్నది? ఈపాప మనోరథముతో నీవీ పవిత్రమందిరమునకు వచ్చినావు."

శైలేశ్వరుని మాటలు పూర్తి యయ్యెను, కాని యావజ్రధ్వని యింకను నరేంద్రుని చెవులలో ధ్వనించుచుండెను. నరేంద్రుఁడు కొంత తడవు వథోవదనుఁడై యుండెను; అతని శరీరము వణఁకుచుండెను. ఆలోచింప నాలోచింప నతని క్రోధ మస్తమించెను, నేత్రములనుండి రెండు బాష్పబిందువులు రాలెను. కొంతసేపటి కతఁడు నిట్టూర్పు విడిచి, మెల్లన నిట్లనెను: "స్వామిన్, నేను పాపిని: నాకు తగిన శిక్ష చేయుఁడు!"

"వత్సా, ఈలోకమున ఔషధము లేనివ్యాధి ప్రాయశ్చిత్తము లేని పాపము లేవు. నిన్నుఁ బరీక్షింప నెంచితిని, శిక్షింప నెంచలేదు."

"స్వామిన్, నేను దయార్హుఁడను గాను. హేమలతవంటి పవిత్రమూర్తి కపకారము తలపెట్టిన యీపాపాత్మున కిహలోకమున ప్రాయశ్చిత్తము లేదు."

"నరేంద్రా, నీవు తలంచుకొనుచున్నంత పాపాత్ముఁడవు కావు. నాకుఁ దెలియని దేమియులేదు నీవు హేమలతను పొందవలె ననుకోరికతో లేవు, ఆమె నొకసారి యీజన్మలో చూడవలె ననుతలంపుతో నీదేవాలయమునకు వచ్చినావు. నీవు చిన్నవాడవు. హేమలత నొకసారి చూచినచో ఆమె కొంప మునుఁగునని నీ వెఱుఁగవు."

"ప్రభో, తమరు సెల విచ్చిన దంతయు యథార్థము. హేమలతకు హాని మాట దూరముగా నుంచుఁడు; ఆమెకు గ్రుచ్చుకొన్న కంటకమును బైటికి వేయుటకు ప్రాణములనీయఁగలను. సర్వాంతర్యామి యగు భగవంతుఁడీ విషయ మెఱుఁగును."

"అట్లయినచో, నీవామెహృదయమున నాటిన కంటకమును దీసివేయుట కేల యత్నింపవు?"

"ఎట్లో సెలవీయవలెను."

"బాల్యమున నీవామెహృదయమున నాటిన ప్రేమకంటకమును బెకలింపుము. నీవట్లు చేయవేని, ఆకంటక మటులే యుండి, హేమలత జీవన్మృత యగును. ఇప్పుడామెకు సచ్చరిత్రుఁడు, ధర్మపరాయణుఁడు నగుభర్త లభించినాఁడు. ఆమె సంసారభారము వహించినది; అప్పుడప్పుడు నిన్ను గుఱించి తలఁచుచుండును. అప్పుడామె భర్తృవిశ్వాసఘాతుకురా లగును. నీవామె చింతను తొలఁగింపవలెను."

"తొలఁగించుటెట్లు? నేనామెను సందర్శించినచో కొంప మునుఁగునని తమరు చెప్పియున్నారు."

"ఉపాయ మున్నది. ఈజన్మాంతమువఱకు హేమలతతో విచ్ఛేద మొక్కసారిగా సంఘటింపవలెను: నరేంద్రా, నీవు నిజముగా నామెమేలు కోరితివేని, నిజముగా నామెకంటకమును బెకలింప ప్రాణములను గూడ విడువ సమ్మతింతు

వేని నారీసంసర్గము విడిచి, సన్యాసివగుము, లేదా ఇస్లాంధర్మము స్వీకరించి, ముసల్మాను కన్యను బెండ్లియాడుము. నీవు చిన్ననాఁటిప్రేమ మఱచి యోగి వయితివనిగాని, అన్యమత మవలంబించి అన్యమత స్త్రీని బెండ్లియాడితి వనిగాని హేమలత విన్నప్పుడు తప్పక యామెహృదయము మాఱిపోవును. మానవహృదయము తీఁగవలె ఎందుకో య్యల్లుకొనును. తన్ను నీవొక్కసారిగా మఱచిపోతివని హేమలత భావించును. వేఱాశ, వేఱుప్రేమ, అన్యోద్దేశము కలవానియెడ ననురాగము చిరకాల మెక్కడ నుండ నేరదు. నరేంద్రా, నీఘోరపాపమున కది విమమప్రాయశ్చిత్తము."

"ఆమెకై యెన్ని కష్టములు పడ నన్నను సిద్ధముగ నున్నానని తమకుఁ దెలియును. అయినను, తమనిర్దేశము దుర్భరము! ఈయౌషధము మిక్కిలిచేదు, ఇంకొక యౌషధము సెల వీయవలెను."

"ఉత్కటవ్యాధికి ఉత్కటౌషధ మవసరము."

"స్వామీ, తాము పరమధార్మికశైవులయ్యు నన్ను ముసల్మాను ధర్మము పరిగ్రహింపు మని యాదేశించుచున్నారే?"

"పాపమువలన మనుష్యుఁడు పశుజన్మము కూడ నెత్తుచున్నాఁడు. కేవలము మతనాశమునకు భయపడుచున్నావా?"

ఇరువురును గొంతతడవు నిశ్శబ్దముగా నుండిరి నరేంద్రుఁడు చెక్కిట చేయి పెట్టుకొని అగ్నికణములవంకఁ జూచుచు నేకాగ్రతతో నేమో యాలోచించుచుండెను. శైలేశ్వరుఁ డాగుహలో మెలమెల్లన విచరింపఁ జొచ్చెను.

కొంత తడవునకు శైలేశ్వరుఁడు గంభీరస్వరముతో, "నరేంద్రనాథా, నీవు మమ్ము విశ్వసించెదవా!" అనెను.

"ఇదిగో నాఖడ్గము, పరిగ్రహింపుఁడు. ఇంకేమి ప్రమాణము కావలెను?"

"అయితే, ఒక సంగతి వినుము. స్త్రీకి ప్రేమయే అవలంబనము, ప్రేమయే జీవనము; పురుషున కట్లుగాదు. పురుషున కెన్నో యాశలు ఎన్నో కోరికలు, ఎన్నో గొప్ప యుద్దేశములు నుండును. నీవు పడుచువాఁడవు, పరాక్రమశాలివి, మానవంతుఁడవు; ఈమంచి లోకమున ఖడ్గహస్తుఁడవై, యశోమార్గము పరిష్కరింపలేవా! స్త్రీలవలె కేవలము రోదనముతో నీజీవనము గడుపనేఁచెదవా? మీవంగదేశము వీరశూన్యము, ఋశశూన్యము నయిన దని విన్నాను. పో, నరేంద్రనాథా, వంగదేశమున యశస్స్తంభము సంస్థాపింపుము; పో, స్వదేశగౌరవ సాధన మొనర్పుము; సింహపరాక్రమము చూపి కీర్తి నిలుపుకొమ్ము. ఈ గొప్ప యుద్దేశముతో నీజీవితము సమర్పింపుము. నీకు తోడ్పడని దేవత ఉండదు. వజ్రపాణియు, శూలపాణియు స్వయముగా నీకోరిక నెఱవేర్తురు."

శైలేశ్వరుఁ డూరకుండెను. నరేంద్రుని నేత్రములు జ్వలింపఁ జొచ్చెను; ఏకాగ్రతతో నతఁ డాయపూర్వశైవునివంకఁ జూచుచుండెను. వెనుక నొకనాఁడీశైవుఁడు యుద్ధము నందెంత నేర్పరిగాఁ గానఁబడెనో, మానవహృదయమును గ్రహించుట యందు నేఁ డంత నేర్పరిగాఁ గానఁబడెను. శైవుఁడు మరల నిట్లు పలికెను: "నరేంద్రా, నీవు విదేశమున, నీఘోరరాత్రిమున నేకలింగ దేవుని మందిరమున పూజ చేయ వచ్చినావు ఎందుకు? దేశక్షేమముకొఱకు వచ్చినావా? ఏదో వీరవ్రతము నవలంబించివచ్చితివా? మహోద్దేశ సాధనార్థము వచ్చినావా? ఛీ నరేంద్రా, నీవంటి వీరపురుషుఁడు యువతీ ముఖ సందర్శనమునకయి జీవితపుమహోద్దేశమును విస్మరించునా? ప్రేమచింతను దూరము చేయుము. అటు కాక, ప్రేమలేని జీవితము నిష్ఫలమని తలఁచితివేని వీరోచిత మగు ప్రణయమున కట్టు పడుము. పురుషసింహా, సింహిని పరిగ్రహింపుము!"

"భగవన్, ఆజ్ఞాపింపుఁడు."

"ఈప్రపంచమున వెదకుము. రోగకాలమున సావిత్రివలె నీకు సేవ చేయవలెను; విపత్సమయమున చాముండా దేవివలె ఖడ్గహస్తముతో నీపార్శ్వమున నిలువవలెను. కుశల కాలమున విమల ప్రణయముచే నీహృదయము సంతృప్తము చేయవలెను. యుద్ధసమయమున యశోగీతములు పాడి, నీశరీరము పులకరింపఁ జేయవలెను. ఇట్టి తరుణి లభించినచో నామెను పరిగ్రహింపుము."

"ఇట్టిస్త్రీ లోకమున నున్నదా?"

"స్వయముగాఁ జూడఁ గలిగితిని. నాయోగబలము వట్టిది కాదు. నరేంద్రా, అట్టి తరుణి లేక నిన్ను నిష్కారణముగా ఈగుహకు బిలువ లేదు. ఇంకొక మాట. నేను చెప్పుచున్న యామె హేమలత కంటె నిన్ను నెక్కువగాఁ బ్రేమించును.

ఈమెను నీవు మునుపు చూచియున్నావు."

"జ్ఞప్తి లేదు."

"నేఁడు స్వప్నమునఁ జూచెదవు. నేను వెళ్ళుచున్నాను. ఈకలశమునందలి మద్యము నాస్వాదించి, నేఁ డీగుహలో శయనింపుము. ఆఱిపోవనున్న యీయగ్నిని జూడుము. నిప్పు బూడి యగునప్పటికి నీ వొక కల గాంతువు. నీకుఁ గానఁబడు తరుణి నీవలె ప్రణయము వాంఛించునది నీవలె అభిమానము గలది. వీరపురుషా, నీకు తగిన దా వీరాంగన."

"మీ మాట లాశ్చర్యకరముగా నున్నవి."

"ఇంకొక సంగతి, సావధానముగా నాకర్ణింపుము. కల గాంచి ప్రభాతమున గుహ విడిచి పొమ్ము. నీకు మూఁడుదినములు గడు విచ్చినాను. స్వప్నమునఁ గానఁబడు స్త్రీని వివాహ మగునదియు, లేనిదియు మూఁడురోజులలో నిర్ధారణ చేసికొనవలెను. సమ్మతిమైన పక్షమున మూఁడురోజుల తరువాత లలాటమున శ్వేతచందనరేఖ దాల్చి అమావాస్యా సాయంకాలమున ఈగుహదగ్గఱ నన్నుఁ గలిసికొమ్ము. ఆకన్య నీ కే విధముగా లభించునో తెలిపెదను. వివాహము సమ్మతము కాని పక్షమున లలాటమున రక్తచందనరేఖ దాల్చి, రమ్ము. నీపాపమునకు ప్రాయశ్చిత్త విధానము దెలిపెదను. ఇందుల కంగీకరింపుము. కానిచో, కాళీదేవి నీకు స్వప్నము సమకూర్పదు."

"సమ్మతించినాను. మూఁడుదినము లయిన తరువాత, అమావాస్యా సాయంకాలమున, ఈ గుహకడ తమదర్శనము చేసెదను. తమరు సెలవిచ్చిన చొప్పున ప్రవర్తింతును."

"నీవు వీరపురుషుఁడవు. నీమాటయే చాలును. ఇప్పటికి మూఁడుజాములకాల మగునది. నేను నిష్క్రమించెదను."

౨౪

నరేంద్రనాథు డాయంధకార గుహలో చాల సేపు ఇటునటుఁ దిరుగఁ జొచ్చెను. చిన్ననాఁటి చెలిమి, యౌవనప్రేమను ఆకస్మికముగా నతడు విసర్జింప సంసిద్ధుఁడయ్యెను. ఎట్టి భీషణచింతలతో నాతని హృదయము కల్లోలమయ్యెనో తెలిసికొన సాహసింపము.

కొంత తడవైన తరువాత నగ్ని చల్లాఱిపోవనుండుట చూచి నరేంద్రుఁడు శైవుని యాదేశము స్మరించి, కలశమున నున్న మదిరను సంపూర్ణముగాఁ గ్రోలెను. అంత నాతని తల తిరుగ జొచ్చెను. అగ్నికొకవైపున నరేంద్రుఁడు శయనించెను.

నరేంద్రనాథుఁ డగ్నిని విలోకింపసాగెను. ఒకసారి కట్టెల నొకభాగము జాజ్వల్యమానమయి, మరల నాఱిపోవును; ఒక్కొక విస్ఫులింగము పొడచూపి, క్రమ్మఱ బొగ్గగుచుండెను. చూడఁజూడ, మండుచున్న నిప్పులు నిర్వాణప్రాయము లయ్యెను. ఆమందకాంతిలో శిలాగుహా రహస్యము లత్యంత విచిత్రముగాఁ గానఁబడెను. గోడమీఁది కాంతిచ్ఛాయల నర్తనమువలె అలౌకిక వ్యక్తి నాట్యము సల్పుచున్నట్లుండెను. కాళీదేవినయన యుగ్మము ధగధగలాడుచున్నట్లయ్యెను. కాళిచేతిఖడ్గము నరేంద్రునివైపునకు ప్రసారిత మగుచున్నట్లుండెను. నరేంద్రుఁడు లేవ యత్నించెను, లేవలేకపోయెను. అతఁడు మెలఁకువలో నుండెనా? లేక స్వప్నావస్థలో నుండెనా?

మిగిలిన యగ్నికణములు చల్లాఱెను. నరేంద్రుఁ డవి చూచుటలేదు, కలగాంచుచుండెను. ఇంతవఱకు దూరపు నీటిధ్వనివలె వినఁబడుచున్నది తటాలున నాఁగి, స్వర్గీయ సంగీతధ్వని యయ్యెను. చిమ్మచీఁకటిలో క్రమముగా తేజఃపుంజము వ్యాపింపఁదొడఁగెను. గోడ యున్న ప్రదేశమునుండి పెద్దశిలాఖండము తటాలున తొలఁగిపోయినట్లు తోఁచెను అందుండి యపూర్వసంగీతధ్వనియు వెన్నెలవంటి కాంతియు బయలు వెడలుచుండెను. క్రమక్రమముగా చంద్రుని కడ్డముగా నున్న మేఘము తొలఁగిపోవ, కాంతి వచ్చుచున్న ప్రదేశము వ్యక్తమయ్యెను. ఇది స్వప్నమా? నిజమా? దేవలోక సౌందర్య విభూషిత యగు పదునాఱేండ్ల కన్నె, వీణె దాల్చి యపూర్వముగా గానము సేయుచుండెను. నరేంద్రుఁడు విస్మయముచే స్తంభీభూతుఁడై, ఆవింత స్వప్నమునే చూచుచుండెను.

ఆయనుపమాన సౌందర్యము, ఆయుజ్జ్వల నయనములు, ఆకృష్ణకేశపాశము, ఆతనూలత మానవస్త్రీలకుండునా? నరేంద్రా, చక్కఁగా విలోకింపుము! ఆముఖమండలము, ఆచారులోచనములు, ఆపెదవులు, నీ వెన్నఁడు చూచియుండద

లేదా? దూరముగా వినఁబడు సంగీతమువలె స్మరణశక్తి క్రమక్రమముగా నరేంద్రుని మానసమున ప్రకాశమ నారంభించెను. కాశీయుద్ధము, దక్షిణనగరము, అచ్చట నొక ముసల్మాను స్త్రీ జ్ఞప్తికి వచ్చెను. ఓ, ఈమె ఆ జలేఖా!

నరేంద్రుఁ డాలోచించుట కవకాశము లేకపోయెను. తోడనే సప్తస్వర సమన్వితము అప్సరాంగనా కంఠవినిర్గతము నగు విచిత్రగీతము పర్వతకందరము నిండిపోయెను. నరేంద్రుని హృదయము కల్లోల మయ్యెను. శ్రుతి కలిపి, జలేఖా గానము చేయుచుండెను. ఆ గాన మెంతమధురము, ఎంత హృదయంగమము, ఎంతభావపరిపూర్ణము! నిశ్చలదృష్టితో నరేంద్రుఁడు జలేఖాదెసఁ జూచుచుండెను: గానము సేయుచో జలేఖా కంఠము నడుమ నడుమ స్తంభిత మగుచుండెను, నేత్రములనుండి బాష్పబిందువులు చెక్కుళ్ళమీఁదుగా జాలుచుండెను.

గీతము

భార్యకు నెయ్యది పరమ ధర్మంబు ?
సాధ్వి యెద్దానిని సాధింపఁ జాలు ?
స్నేహంబు దానముచేఁ దుద జాఁక
పతిప్రేమతత్త్వమను భాగ్యగాఁ గలుగ.
సంపదవేళను సతి లక్ష్మివోలె
ప్రజ్వరిల్లఁగ జేసి ప్రణయదీపంబు
ఆత్మేశునకు మోద మభివృద్ధిచేయు.
జాగ్రదాశాగతి సంగర స్థలిని
కాంతుని హృదిఁ బరాక్రమ పూర్ణముగను
వీరపతివ్రత వెలయింపఁ జాలు.
క్రమముగా దుఃఖాంధకారాన జీవి
తాశాప్రదీపము లారి పోవఁగ,
స్వామి కష్టములలో సగముభాగంబు
దాలిచి భారంబు తగ్గించు సాధ్వి.
జీవితాబ్ధిమునుండి జీవనతార
రాలిపోవఁగఁ బతివ్రత సంతసమున
కాంతునితో సహగమనమ్ము సేయు !

ఈ తాత్పర్యము గల మధుర గీతము సమాప్తమయ్యెను; కాని నరేంద్రుని కర్ణకుహరమున మాత్రము గీతము ధ్వనించుచుండెను. ఒకసారి మధురధీరముగాను, మఱియొకసారి వజ్రధ్వనితోను గీతము వినఁబడసాగెను. జలేఖా మానవస్త్రీయా? లేక దేవకన్యయా? ఎవతె యయినను నరేంద్రుఁ డామె ముఖమండలమును మాటిమాటికి వీక్షింపసాగెను. వెనుకటికంటె నామె యిప్పుడెక్కువ సుందరముగాఁ గన్పట్టుచుండెను. అయినను, విచారముచే లలాటమున పాండువర్ణము, బాహువులందు క్షీణత, నేత్రములయందు దుఃఖనివాసము గోచరించుచున్నట్లుండెను. నరేంద్రుఁ డామెవంక చూచుట కవకాశము లేకుండ సంగీతధ్వని పర్వతకందరమును కంపింపఁజేయఁజొచ్చెను. విషాదకరమైన యాగానము నరేంద్రుని హృదయమున పెక్కుల నాలోచనము, దుర్విభావములు నఁచెను.

గీతము

భర్తృ ప్రేమకై భార్యయాచించు!
పట్టియున్నది నీదు పాదయుగ్మంబు
నచరలతవోలె, నామెను నీవు
స్నేహబిందువులచే జీవింపఁజేసి,
ధరణిపైఁ బడకుండఁ దప్పింపు నాథ!
స్వజనుల, మాతృదేశంబును వీడి
దూరభూములకు నీతోడ వచ్చినది.
సుఖియించు నామె నీసుఖములయందు,
దుఃఖించు నామె నీదుఃఖమ్ములందు,
పడసినఁ జాలు నీపాదాలనీడ !
బ్రదికిన యన్నాళ్ళు పరవాంఛలేదు.
తుదివేళ, నాథేశు వదనము చూచి,
పాదములం బట్టి ప్రాణాలు విడుచు!
ఇంతకంటెను సాధ్వి కేకోర్కెయుండు?

గీతము సమాప్తి నొందెను. నయన జలముచే ఆ పాండురముఖము, వక్షస్థలము తడిసిపోయెను. మేఘచ్ఛాయచే సూర్యకాంతి మెలమెల్లన అచ్ఛాదిత మగునట్లు కాంతివచ్చుచున్న ద్వార మాచ్ఛాదిత మయ్యెను. ఆ దేవతా విగ్రహ మంతర్ధానమొందెను; గాఢాంధకారములో వీణానిక్వాణము లీనమయ్యెను. వెనుక విన్న దూరజల మర్మరము తప్ప నరేంద్రునకు ఇంకేమియును వినఁగా లేదు. అతఁడు గాఢనిద్రావిలీనుఁ డయ్యెను. స్వప్నమునఁ గాంచినది పరిభ్రాంతమున నతనికి జ్ఞప్తి లేదు. మెలఁకువ వచ్చి లేచునప్పటి కాతనికి మత్తు లేదు. అంత నరేంద్రుఁడా గుహలోనుండి బయలికి వచ్చెను. నవోదితబాలాతపమున వృక్షలతాదులు, దూర్వాదళములు ధగధగ లాడుచుండెను. కొమ్మకొమ్మను పక్షులు కిలకిల లాడుచుండెను. తెల్లరాతిలోఁ గట్టిన యేకలింగస్వామి

వారి పెద్దదేవాలయము నీరెండలో శోభావంత ముగా నుండెను. దేవాలయము జనాకీర్ణ మయ్యెను. నల్వంకల, పర్వతములపై బర్వతములు సూర్యరశ్మిలో సుందరముగఁ గన్పట్టుచుండెను.

౨౫

ఆమూడు రోజులు నరేంద్రుఁడు చింతాజాలములోఁ జిక్కి యెట్లు దుఃఖించుచుండెనో వర్ణింప వీలుపడదు. చింతాశతము వృశ్చిక తముకంటెఁగూడ బాధాకర మయ్యెను.

ఆ గుహలో శైలేశ్వరుఁడు చేసిన నియమము నరేంద్రుఁడు విస్మరింపలేను. శ్రీశచంద్రునకు హేమలతకును వివాహ మయినసంగతి ఒకకాలము క్రిందటనే నరేంద్రునకుఁ దెలియఁగును. హేమలత పరగృహాణి. ఆమెంగూర్చిన విచారము, ఆమె యెడ ననురాగము నీకుఁదగునా ! నరేంద్రా, అది వీరోచిత కార్యమా! శైవుని యున్నతాదేశము పర్యాలింపుము, అనురాగచింత నుత్పాటింపుము, యశోమార్గము సంస్కరింపుము, దేశగౌరవ సాధనము నాలోచింపుము. ఇంతకంటె వీరోచిత కార్య మింకేమి కలదు ! శైవునియానతి తలఁదాల్చవలసిన దని నరేంద్రుఁడు నిశ్చయించుకొనెను.

గంగాతీరమున వీడుకోలు సమయమున నతిశ్రీకాంతిలో శుష్కించి పాలిపోయిన ముఖము మరలఁ గానవచ్చెను; దీనురాలైన హేమలత వృత్తాంతము మెల్లన నరేంద్రునకు జ్ఞప్తివచ్చెను: అతని శరీర మంతయు పొటపరించెను. నరేంద్రుఁడు గృహత్యాగము చేసినప్పుడే బాల్యకాలమునఁ దనతో నాడుకొనిన హేమలత యావజ్జీవము సెల విచ్చె నని నరేంద్రునకుఁ దోఁచెను. చిన్నతనమున హేమలత నరేంద్రుని దప్ప నింకెవరి నెఱుఁగదు; యౌవనప్రారంభముననూ ఉదయాస్తమయముల నతనిం జూచుచో నామె యుద్వేగ శూన్యయు శాంతచిత్తయు నగుచుండెడిది. చిన్ననాఁటి సంగతు లన్నియు యెడతెగని తరంగములవలె నరేంద్రుని హృదయమును గలచివేయఁ జొచ్చెను. ఇంక నాతఁడు దుఃఖము సహింపలేక, దేవాలయము ప్రక్కనఁ గూరుచుండినిశ్శబ్దముగా కన్నీరు విడువఁ జొచ్చెను. ఆదిన మాతఁ డేమియు నిర్ధారణము చేయలేకుండెను.

మూఁడురోజులు గడచెను. మూడవనాఁటి రాత్రి నిర్దిష్టసమయమునకు రెండుగడియలు ముందుగా నరేంద్రుఁడు గుహాముఖమున నిలుచుండెను. ఒకమాటు అటు నిటు నడుచుచుండెను; మఱియొకసారి నల్లని యాకాశమువంక నిశ్చలముగాఁజూచుచుండెను; ఇంకొకమారు గుహాముఖమును జేరి నిలువఁబడుచుండెను. అతనిచేతిలో విచ్చుకత్తి యుండెను; ఆకారము గంభీరముగ నుండెను.

కొంతసేపటికి శైలేశ్వరుఁడు వచ్చి, నరేంద్రు నాశీర్వదించెను. నరేంద్రుఁడు గోసాయికి ప్రణామము చేయ మఱచెను.

“స్థిరప్రతిజ్ఞ చేసికొన్నావా?” అని శైలేశ్వరుఁ డతని నడిగెను.

“ఆఁ!” అని నరేంద్రుఁడు గంభీరము కొంచెము కఠినము నగుస్వరముతోఁ బలికెను. ఇరువురును గుహలోనికి జనిరి.

పూర్వమువలెనే ఆగుహ జాజ్వల్యమానముగ నుండెను. నరేంద్రుని లలాటము, గండస్థలము, వక్షఃస్థలము, బాహువులు నొక్కమాఱుగారక్తచందనముతో లిప్తములై యుండెను.

“పాపిష్ఠా! పరకాంతమీఁది కాంక్ష విడువలేవా?” అని శైలేశ్వరుఁ డనెను.

“పరస్త్రీ కాంక్ష లేదు.”

“హేమలత నీజన్మములోఁ జూడఁగోరవా?”

“చూడను.”

“యువనకన్యను వివాహ మాడనిష్టము లేదా?”

“ఈజన్మకు లేదు.”

శైలేశ్వరుఁ డించుక యూరకుండి, మరల నిట్లనెను. “ప్రతిజ్ఞ పాలించుటకు సంసిద్ధుఁడవు కమ్ము. ఖడ్గము పిడిచి, కాళదేవి సమ్ముఖమున నీప్రాణము లర్పింప సిద్ధము కమ్ము!”

“నేను జేసిన ప్రతిజ్ఞ నెఱవేర్చుటకు సిద్ధముగా నున్నాను. మీసన్నిధికి వత్తు నని చెప్పియుంటిని, వచ్చినాను.”

“మూఢా, సింహపు గుహలోఁ బ్రవేశించి, యింకను ప్రాణముల కాశపడుచుంటివా! ఇక్కడ నీ కెవరు దిక్కు?”

“నాఖడ్గమే నాకు శరణము.”

గుహలో నొకచోటినుండి శైలేశ్వరుఁడు నిశ్శబ్దముగా ఖడ్గము బయటికిఁ దీసెను. ఉదయపురమున యుద్ధము జరిగినప్పుడే నేఁడును వార్ధకతికి

యుద్ధము జరిగెను. నరేంద్రుఁ డప్పటికప్పుడె నిప్పుడు ఎక్కువ భద్రముగా, ప్రయత్నపూర్వకముగా యుద్ధము చేయసాగెను; కాని అంతయు నిష్ఫలమయ్యెను. సింహపరాక్రముఁడగు శైవుడు త్వరగానే నరేంద్రు నోడించి, యాతనిఖడ్గము నావలఁ బడఁగొట్టెను.

"కేవలము పూజతోనే నాకల నరఁగులేదు. రాజస్థానము వీరప్రసవిని. యుద్ధకాలమున గోసాయీలు పరాక్రమము చూపుటలో నగ్రగణ్యులు. చిన్నవాఁడా, నీతో యుద్ధము చేయుట వలన మాకుఁ గళంకము వచ్చినది!"

"నేను సిద్ధముగా నున్నాను. మీయిష్టము వచ్చినట్లు చేయవచ్చును."

"శైలేశ్వరుడు గడ్డిత్రాడు బయటికిఁ దీసి దానితో నరేంద్రుని రెండుచేతుల యందలి నాడు లుబ్బునట్లు గట్టిగాఁ గట్టివైచెను. నరేంద్రుఁ డొక మాటయైనఁ బలుకలేదు. శైలేశ్వరుడు పూర్వము వలెనే కలశము గొనివచ్చి నరేంద్రుని నోటికడ నుంచి మద్యము త్రాగుమనెను. నరేంద్రుఁ డట్లు చేసెను. గోసాయి గుహనుండి వెడలి పోయెను.

మత్తుచే నరేంద్రుఁడు శీఘ్రముగా నేలపై నొరగెను. అతని కన్నులు చీఁకటులు క్రమ్మెను. గుహాప్రక్కన నిద్దరు జనులు మెలమెల్లన ఏవో మాటలాడుచున్నట్లు లాతనికి దోఁచెను. ఆమాట నాలకించుచు మదిరా ప్రభావమున నతఁడు నిద్రాభిభూతుఁ డయ్యెను. తరువాత నేమి జరిగెనో యాతనికి జ్ఞప్తి లేదు.

అతనిది గాఢనిద్ర గాదు. నరేంద్రుఁడు రాత్రి యంతయు కల గాంచుచుండెను నడుమనడుమ నాతనికి మెలఁకువ కలుగుచుండెను. మత్తుచే నాతఁ డేమియు తిన్నఁగా గ్రహింపలేకుండెను.

చాలసేపటికి పూర్వమువలెనే ఆయంధకారమున దీపకాంతి కానవచ్చెను. మరల రాతిగోడ కదలిపోయెను. మేఘములు దాటిపోవ వెన్నెల కాయుచున్నట్లుండెను. ఆవెన్నెలలో నాయుజ్జ్వలమూర్తి! కాని జలేఖా నేఁడు సంగీతము పాడుట లేదు, వీణె చేతఁబూని రాలేదు, ఖడ్గహస్తముతో వచ్చినది!

ఎంతభయంకర మూర్తి! ఆమె నేత్రముల నుండి నిప్పుకణములు రాలుచుండెను, పండ్లు బిగబట్టి యుండెను, ముఖ మంతయు రక్తవర్ణమై క్రోధముచే ప్రజ్వరిల్లుచుండెను. ఆమె హస్తమున వైశ్రుని దీర్ఘ ఖడ్గము, భుజమున వాడిచురకత్తియు నుండెను. నరేంద్రుఁ డాశ్చర్యము నొందెను. అతని నొసటినుండి చెమ్మట స్రవించుచుండెను. నరేంద్రుఁడు లేవ నుద్యమించెను; కాని స్వప్నమున విపద్గ్రస్తుఁడైన పురుషునివలె లేచుటకుఁ గాని, పోవుటకుఁ గాని శక్తి లేకుండెను.

మృణాళమువంటి హస్తమున ఖడ్గము బూని జలేఖా గుహలోఁ బ్రవేశించెను. ఆమె యొక్కమారు నిలిచెను, ఒకమారు నరేంద్రుని వంకఁ జూచెను. చేతినుండి ఖడ్గము జారిపడెను.

తరువాత నామె వాడిచురకత్తిని దీసి, నిశ్చల హస్తముతో నరేంద్రుని బొమ్మపై మోపెను. మరల నేమి తోఁచెనో; ఛురిక యామెచేతినుండి జారి క్రిందఁబడెను. మెలమెల్లన జలేఖా వెడలి పోయెను.

నరేంద్రుఁడు కేక వేసి, లేచి, కూరుచుండెను, అతనికి బాగుగా మెలఁకువవచ్చినది అతని శరీర మంతయు చెమటతోఁ దడిసిపోయెను; మత్తు తొలఁగిపోయెను. గుహ చీఁకటిగాను, నిశ్శబ్దముగాను ఉండెను. మెల్లమెల్లన నరేంద్రుఁడు గుహనుండి యావలకు వచ్చెను, తూర్పు తెల్లవారుచుండెను. ఆకసమున రాగరేఖలు మనోహరముగా నుండెను. ఆరిపోవ నున్న దీపములవలె నింకను ఒకటిరెండు నక్షత్రములు మినుకు మినుకు మనుచుండెను. ప్రభాత శీతలవాతము పర్వతశ్రేణిమీదను, శివాలయము మీదను వీఁచుచు, అప్పుడే వికసించుచున్న పుష్పపరిమళమును దాల్చి, నిద్ర నుండి మేల్కాంచిన లోకమున కామోదము కలిగించుచుండెను. పొదలనుండి యొకటిరెండు పక్షులు మనోహరముగా పాడుచుండెను.

౨౬

పైఁజెప్పిన సంగతులు జరిగిన తరువాత కొద్దిరోజులకు జోధపురాధిపతి రాజాజస్వంతసింగు మరల సైన్యముతో ఔరంగజేబతో యుద్ధము చేయుటకయి అగ్రాభిముఖముగాఁ జనెను. నరేంద్రుఁడు నాసైన్యములోఁ జేరి రాజస్థానము విడిచెను. నరేంద్రుఁడు ఉదేపూరున నున్న కొద్దినెలలలో ఆగ్రాయం దొకవిప్లవము ఘటిల్లెను. ఇప్పుడాగ్రాలో వెనుకటి పాదుషా లేడు, వెనుకటి

ప్రభుత్వము లేదు ఆ విప్లవము నిచట సంగ్రహముగా వర్ణించుట యవసరము.

భయంకరమైన యీభ్రాతృ యుద్ధ ప్రారంభమున వారాణసిలో సుల్తాన్ సుజాయును, ఉజ్జయినిలో జస్వంతసింగును పరాజయము నొందిరని యిదివరకే వర్ణింపఁబడినది. రెండవసంగతి విని పాదుషా పెద్దకుమారుఁడు దారా అత్యంతక్రోధమున లక్షాధిక సైన్యమును వెంటబెట్టుకొని యుద్ధమునకు బయలుదేరెను. చంబల్ నదీ తీరమున నాతఁడు శిబిరమును సంస్థాపించి ఔరంగజేబు మురాదుల యాగమనమును ప్రతీక్షించుచుండెను. శీఘ్రకాలములోనే వారును నదికావలియొడ్డున విడిసిరి. మురాదు పరాక్రమశాలి, రణనీతి వేత్త, నది దాఁటి యుద్ధముచేయుటకయి యాతఁడు సలహా యిచ్చెను కాని, కుతంత్రపటువగు ఔరంగజేబు అట్లు చేయక, దారాను మోసపుచ్చుటకు డేరా లచ్చటనే విడిచిపెట్టి కేవలము సేవలతో రహస్యముగా నదిని సరోకచోట దాటి, ఆగ్రాకు ౭౮ కోసుల దూరములో యమునాతీరముననున్న శ్యామనగర వనగ్రామము దగ్గఱ శిబిరము స్థాపించెను. శత్రువులు చంబల్ నదిని దాటి ఆగ్రాసమీపమున విడిసిరని విని దారా అత్యంత విస్మయావిష్టుఁ డయ్యెను. తోడనే యతఁడు సేనను దీసికొని పని, శ్యామనగరము కడ యమునాతీరమున విడిసెను.

భారతవర్ష సింహాసనము శ్యామనగర యుద్ధ ఫలితము ఉభయ పక్షములు యుద్ధమునఁ జొచ్చుటకు సంకోచించెను. నాలుగు రోజులిరు పక్షములు మిన్నకుండెను. అయిదవనాఁడు యుద్ధము ప్రారంభమయ్యెను. దారాకు ఎడమవైపున రాజారామసింగు, ఛత్రసాలులును పరాక్రమము చూపి నిహతులయిరి. కుడి వైపుననున్న కాలీ ఉల్లా అను ముసల్మాన్ సేనాపతి ఔరంగజేబు యొక్క లంచము తిని ద్రోహియై యుద్ధము చేయలేదు. తుదకు ఔరంగజేబుకు జయము కలిగెను.

నేర్పరియగు ఔరంగజేబు యుద్ధక్షేత్రమున కాలీ ఉల్లాను గౌరవించెను; మురాద్ భాగ్యవశమున సమ్రాట్టు అని ప్రకటించి వానికి మనస్తుష్టి చేసెను.

ఔరంగజేబు ఛలమున, బలమున, కౌశలమున ఆగ్రాను శీఘ్రముగా వశము చేసికొని తండ్రిని చెరసాలలోఁ బడవైచెను. షాహజహాన్ చిన్నకూఁతురు రోషన్ ఆరా అనేకవిషయములలో ఔరంగజేబుకు వార్తలంపుచు మిక్కిలి తోడుపడుచుండెను. అతనికి విజయము కలిగిన తరువాత రోషన్ ఆరా ప్రభుత్వమునకు మేలేకుండెను. షాహజహాన్ పెద్దకూతురు జహాన్ ఆరా చెల్లెలికంటె నన్నివిధముల శ్రేష్ఠురాలు. ఔరంగజేబు జయము నొందినతరువాత నామె హతాశయై అప్పటినుండి పితృసేవలో కాలక్షేపము చేయుచుండెను.

ఆగ్రాను వశము చేసికొని ఔరంగజేబు ఢిల్లీకి బయలుదేరెను. మార్గమున నతడు మురాదును మధురకుఁ బిలిచెను. మురాదు మద్యపానముచేతను విలాసినీగణముచేతను మత్తుఁడై యుండెను. మురాదును నడుమనుంచి ఆజ్ఞానోన్ముఖులు చుట్టును గూరుచుండిరి, అతఁడు సంపూర్ణముగా ముగ్ధుడై యొకసుందరి నాలింగనము చేసి, యొడలెఱుంగక పడిపోయెను. ఔరంగజేబునకుఁ గావలసినదిదియే. మురాదు నతఁడు రాత్రివేళనే కారాగారమునఁ బడవైచెను.

అటువాత ఔరంగజేబు రాజచ్ఛత్రమును తలపైఁ దాల్చెను. దారా సింధునదివైపునకు పలాయనము చేసెను. వంగదేశమునుండి సుల్తాన్ సుజా మరల సైన్యము వెంటఁబెట్టుకొని, యుద్ధయాత్ర చేసెను. పరాజయావమాన మింకను మఱవని జస్వంతసింగు మరల రాజస్థానమునుండి ససైన్యముగా బయలు వెడలెను.

(పూర్తి కాలేదు)



# స్వకీయ చరిత్ర

[ఒక కథ]

చింతాదీక్షితులు, బి. ఏ, ఎల్. టి.

## పీఠిక

గుంటూరులో మొన్న మొన్నటిదాకా సబ్ జడ్జీచేసి జనేవరి నెలలో కాలం చేసిన శ్రీధర రావుగారి స్వకీయచరిత్ర యీ క్రింద ముద్రిస్తున్నాము. ఆయన చనిపోయిన కొన్ని నెలలదాకా ఆయన కాపురమున్న యిల్లు తాళము వేసియుండెను. తరవాత ఆయనల్లుడును మా స్నేహితుడును అయిన సుబ్బారావు తాళములు తీయించి యింట్లో ప్రవేశించెను. శ్రీధర రావుగారి కాకితములు పరిశీలించడములో ఈ క్రింది చరిత్ర ఆయన సొరుగు పెట్టెలో దొరికినట్టూ, అది 'సాహితీ'లో ప్రకటించవలసినదనిన్నీ మాకు చెప్పటచే అది మేము ప్రకటిస్తున్నాము. ఆంధ్రదేశంలో వున్న పెద్దవుద్యోగస్థులలో మంచి వాడనిన్నీ దానశీలుడనిన్నీ, ఉపకారబుద్ధి కలవాడనిన్నీ పేరుప్రతిష్ఠలు సంపాదించిన శ్రీధర రావు గారిని ఎరుగని ఆంధ్రులుండరు కాని మొదటినుంచీ పెళ్ళిచేసుకొనక బ్రహ్మచారిగానే వుండి నిష్కలంక ప్రవర్తనము గలవాడై యుండుటకు కారణము ఎవరికీ ఇదివరలో తెలిసివుండదు. ఇదివరలో చాలామంది ఆయన బ్రహ్మచారి కాడనిన్నీ ప్రథమ భార్య పోయిన తరవాత మళ్ళీ పెళ్ళి చేసుకోవడం మానివేసినాడనిన్నీ చెప్పుకోవడం కలదు. ఆ అభిప్రాయం యదార్థము కాదని యీ క్రింది చరిత్ర చదివిన వారికి బోధపడగలదు. అంతేకాకుండా నిజమైన ప్రేమ యెట్టిదో ఆయన అనుభవించినాడని కూడ అందరకు తెలియగలదు. నిజమైన ప్రేమకు ప్రతిఫలము ప్రేమించిన వారితో సౌఖ్యమనుభవించడమైతే ఆయన ప్రేమకు ప్రతిఫలము ముట్టలేదని చెప్పవచ్చును. ప్రేమించడమే సౌఖ్యముగా భావించి ఆ సౌఖ్యమే ప్రేమకు ప్రతిఫలముగా గ్రహించిన యెడల అట్టి సౌఖ్యమాయన కున్నట్లే చెప్పవలెను. ఇంకొక విషయము చెప్పి యింతటితో ఈ పీఠిక ముగిస్తున్నాము. ఈయన చిన్నతనమునుంచీ తెలుగు భాషయెడ అభిమానము గలవాడనీ, ఆంధ్రత్వమీయనయందు మూర్తీభవించినదనీ ఒక్క యంశమును బట్టి నిర్ణయించవచ్చును. ఇంగ్లీషు భాషలో నిరంకుశంగా వ్రాయ శక్తివుండినిన్నీ ఈయన స్వకీయ చరిత్రము మొదటినుంచీ చివరవరకూ ఆంధ్రముననే వ్రాసివున్నాడు. ఆంగ్లత్వమాదర్శముగానుంచుకొన్న నేటి విద్యార్థులు

ఉద్యోగస్థులు విద్యార్థులూ ఈవిషయమును గమనించండి !

౧

నేను కాలేజీక్లాసుల్లో చదువుకొంటున్న కాలంలోవున్న వుత్సాహం ఇప్పుడు రమ్మంటే ఎలావస్తుంది? అప్పటిచురుకుదనము, అప్పటి తెలివి తేటలు లేవని నాస్నేహితులు నన్ను ఎత్తిపొడుస్తూ వుంటారు. అప్పటి సరదాయేలేదని మరికొందరు పురికొల్పుతూ వుంటారు. స్నేహితులు పురిగొల్పినంత మాత్రాన పోయినవి మళ్ళీ వస్తవా? పోవుటకు కారణం నాస్నేహితులకు తెలియదు. నాకుతప్ప ఇంకెవ్వరికీ తెలియదు.

నాతల్లిదండ్రులు ఇంతా అంతా కాదు నన్ను బలవంతపెట్టడం పెళ్ళిచేసుకోమని. నేనుచేసుకోనని భీష్మించుకు కూర్చున్నాను. పెళ్ళిచేసుకోకపోతే వంశం అంతరిస్తుందనీ, పుట్టగతులుండవనీ ఎన్నో విధాలుగా నయాన్నీ భయాన్నీ చెప్పి బోధించారు. పదిమందిచేతా చెప్పించారు. ఎంతచెప్పినా ఎంతచెప్పించినా నేను విన్నానుకాను. మొక్కగా వున్నప్పుడే వంచకుండా వూరుకొని చెట్టైనతర్వాత వంచడానికి ప్రయత్నించడంవల్ల ఇంతమట్టుకు వచ్చిందనుకొని వూరుకున్నారు. ఊరుకున్నారూ—రోజుకు ఎన్ని రాయబారాలు స్నేహితుల చేత—ఎన్ని సాధింపులు—కుక్కమీదా పిల్లిమీదాపెట్టి ఎన్ని తిట్లు—నాప్రాణం కొరుక్కుతిన్నారు. ఏన్నోకొన్ని సంవత్సరాల వయస్సు చెల్లినమీదట పుత్రుణ్ని మిత్రుడిలాగ చూచుకోవాలన్న సంగతి వాళ్ళకు తెలియకగాదూ నన్ను ఇలా వేధించడం!

ఇంతకూ వీళ్ళవల్ల నాకుకలిగే కష్టములు ఎంతపాటి? నేనిదివరలో అనుభవించిన మనఃక్లేశములో ఇదిఎన్నోపాలు? పగలనక రాత్రిఅనక—ఆశపెట్టుకొని, ఆశ నిరాశకాగా పొందిన చిత్తసంక్షోభమునకూ, దీనికీ సాటివున్నదా? ధనముపోతే అంతబెంగ వుండదనుకుంటాను, బంధువులు పోతే అంతబెంగ వుండదనుకుంటాను. ఇంక ఏమి పోయినా మనిషికి కలిగే దుఃఖలేశము అనునయమువల్ల అంతరిస్తుంది. కాని నాకు కలిగిన దుఃఖము ఆమరణాంతము నన్నంటివుండవలసిందే, నాతోడు నీడై వుండవలసిందే! ఈదుఃఖమే నాప్రాణమిత్రము. ఈదుఃఖము నన్ను ప్రేమించి నన్నంటితిరుగుతూ వుంది. నేను దీనిని తిరిగి ప్రేమించకుండా వుండలేను.

నాకు పుట్టిన ఈదుఃఖమును నేను ప్రేమిస్తానంటే లోకమెందుకు నవ్వడం? లోకంలో ఎవరికీ పుట్టిన పిల్లలను వారు ప్రేమించకుండా వున్నారా? ఎందుకని తమ బిడ్డలను తాము ప్రేమిస్తున్నారు? తెలివిగలవారనా? పశుతుల్యులే!

అందముగలవారనా? అందము లోకములో సామాన్య లక్షణముకాదే! ఆనందము కల్పిస్తున్నారనా? ఎట్లు ఆనందము కల్పిస్తున్నారు? తమకు పుట్టిరి

కాబట్టే ఆనందము కల్పిస్తున్నారు. ఇతరులకు పుట్టిన బిడ్డలు ఆనందము కల్పిస్తున్నారా? అలాగే నాకు పుట్టిన యీ నా చిత్తక్లేశమును నేను ప్రేమిస్తాను. బిడ్డలతోటి సంసారము ఆనంద దాయకమైతే ఇదీ ఆనందదాయకమే.

దీనిని మరణకాలాన నాతోకొనిపోతాను. నేను కాలముచేసిన పిమ్మట నాభౌతిక దేహము అగ్నిజ్వాలల కాహుతిఅవుతుంటే ఈదుఃఖము నాచితిపైకెక్కి సహగమనము చేస్తుంది. ఇట్టి నాదుఃఖమును నేను వదల గలనా? నేను వదలలేను! ఈదుఃఖమే నాకుసుఖమునిస్తూవుంటే నేను దీనినెట్లు విడవగలను? సుఖదుఃఖములు కవలపిల్లలు. లోకములో అందరు సుఖమనేపిల్లనే ప్రేమిస్తారు, నేనుదుఃఖమును ప్రేమిస్తాను; అదేనాసుఖము, కాదా? నేనుపరితపిస్తూన్నట్లుపరితపించే ఎవ్వడైనా ఈదుఃఖమనేప్రాణమిత్రుణ్ని వదలివుండగలడా? ఉదయకాలమున, చల్లని వాయువులు విసరుతూ లోకానందమును కల్పిస్తూన్న సమయాన్ని నేనునాదుఃఖమును ఆహ్వానముచేస్తాను. సాయంకాలమున సైకతముల విహరిస్తూ నాదుఃఖముతో సరససల్లాపము లాడుతాను. రాత్రివేళల కటికినేలల బరుండి నిద్రనుదూరముగా పారద్రోలి దుఃఖముతో కూడియాడుతాను. ఈదుఃఖమనగా నెవ్వరు? ఈదుఃఖమునాకెందువలన కలిగింది? ఏవధూటిచల్లనిచూపులు నాపైపడగా, నేనుఒకప్పుడు పరవశుడనైవుండి వుంటినో అట్టి వధూటి నాకుపారితోషికముగా నాకొసగినదుఃఖముకాదాయిది? ఏలతాంగి కరస్పర్శ నాకుపులకలెత్తించిందో ఆలతాంగి నాకుపరిచర్యచేయబంపిన చెలికత్తెగాదాయిది? ఏమనోహారిణివిగ్రహమునాహృదయ పీఠముపై నెలకొనివున్ననో ఆనామనోహారిణినాహృదయముపై నుంచిన శాశ్వత ముద్రగాదాయిది? ఏసుందరాంగి వదనగహ్వరమున తాండమాడు ప్రాణవాయువు నాకు ప్రాణము నొసగినదో ఆసుందరాంగి నాకు పోసినజీవముగాదా యీదుఃఖము? ఏసుకుమారగాత్రి నాహృదయ కోశమున ప్రణయవజ్రములు కొలుదోల్త దాచియున్నదో ఆవజ్రములకర్కశత్వముకాదా యీనాదుఃఖము?

ఇట్టిదుఃఖము నాదగ్గరకువచ్చిన్ను మోహించినప్పుడువద్దుపొమ్మనగలనా? ఈదుఃఖమును నాహృదయపీఠముపై నధిష్ఠింప జేసినాను. బాష్పధారలతో దీనికర్ఘ్యపాద్యము లొసగుచుంటిని. ఆత్మచింతనల ధారపోసి పోషించుచుంటిని కొలుచుచుంటిని. ఆహా! ఏమినా సుఖము! ఏమినాయానందము! లోకమా! ఒక్కమారు నీవు నీకడనున్న దుఃఖము నంతనూ నాకువదలివేయుము. ఆ దుఃఖసాగరమున బడి నేనీదులాడుతాను, పరవశత్వము జెందుతాను, అపూర్వసౌఖ్య మనుభవిస్తాను!

ఈనాదుఃఖము నన్ను భక్షించిబతుకుతున్నది. నేనులేకుంటే దానికాహారములేదు. నేనాదుఃఖమునుతిని బ్రతుకుతున్నాను. ఈదుఃఖము లేకుంటేనేను బ్రతుకలేను. దుఃఖమునన్ను తింటున్నది నేనుదుఃఖమును తింటున్నాను. ఇందులోవింతలేదు! ప్రాణికోటులను తిని

మనిషి బతుకుతాడు; మనిషిని తిని ప్రాణికోటులు బతుకుతవి. వృక్షములు జంతువుల కాహారమిస్తున్నవి. జంతువులు వృక్షములను పోషిస్తున్నవి; వృక్షములు జంతువులను తింటున్నవి, జంతువులు వృక్షములను తింటున్నవి. సృష్టికి మొదలువుంటే అప్పటినుంచీ ఈసాంప్రదాయం ఇలాగే జరుగుతూవుంది.

౨

నేను చెన్నపట్టణము కాలేజీలో చదువుటకు వెళ్ళితిని. ఏముహూర్తాన వెళ్ళితినో ఆముహూర్తము మంచిదననా? చెడ్డదననా? చెడ్డదనడం ఎందుకు మంచిదే అంటాను.

వెళ్ళినతర్వాతనే కదా నాలోసుషుప్తిగావున్న చిత్తవృత్తులన్నీ ఒక్కమాటు ఉలిక్కిపడి లేచినవి. నాహృదయములో మొగ్గదొడుగుతూవున్న అనురాగవల్లికఒక్కమారుగా పుష్పించింది. నాజీవితమంతా ఒక్కసారి ఆశాచంద్రికలో ఓలలాడింది. నేనువెళ్ళడంవల్లనే కదా నాజీవితానికి పట్టుగొమ్మ ఒకటి లభించింది, లక్ష్యమొకటి చిక్కింది!

రెండవసంవత్సరం చదువు ముగియడానికి సిద్ధంగావుంది. ఇక పదిపదిహేను రోజుల్లో కాలేజీకి సెలవులిస్తారు. అంతవరకూనేను చాలా శ్రద్ధగా చదువుతూవున్నాను. పుస్తకాలు విడిచినేను ఎప్పుడూ దూరముగా వుండలేదు. అప్పుడు పుస్తకమును చూస్తే ఆప్తబంధువును చూసినట్లు వుండేది. పుస్తకములప్పుడు నాకు జీవములేని పదార్థములుగా తోచలేదు. సజీవములై, సన్నిహిత బంధువులై నన్నుకనిపెట్టుకువున్న ప్రతిభాశాలురవలె వుండేవి. ఇట్టిపుస్తకములమీద ఆనాటినుంచీ నాకు విముఖత్వం కలిగింది. ఈఆప్తబంధువులను ఆనాటినుంచీ దూరముగా పారద్రోలినాను. ఈప్రతిభాశాలుర హితవాక్యము లానాటినుంచీ వినకుండా పెడచెవిని పెట్టినాను. ఏనాటి నుంచీ? నేనుచదువుతూవున్న క్లాసులోనే చదువుతూవున్నది శ్యామల. నాపుస్తకాలను నేనుప్రేమించి వున్నకాలములో శ్యామలపేరు నే నెరగను. నాపుస్తకాలిచ్చే ఆనందములో పరవశుడనైవున్న దినములలో శ్యామలను కన్నెత్తిచూడలేదు.

ఒకనాడు నానోటు బుక్కు బల్లమీద విడిచివెళ్ళితిని. మళ్ళీతిరిగివచ్చి చూసుకొంటిని. నాకళ్ళ యెదుటరెండు పేర్లు కనుపించినవి. నాపేరు పైన వున్నది. క్రిందశ్యామలపేరు వున్నది. ఈరెండు పేర్లు శ్యామలే వ్రాసిందని గ్రహించడంలో నాకు కష్టంలేకపోయింది. ఎవ్వరూ చూడకుండా రాసివుండాలి అనుకున్నాను.

ఆక్షణాన నేనుపూర్తిగా మారిపోయినాను. ఆక్షణాన నాచిత్తములో నూతన సంస్కారణము జరిగింది నూతన జీవిత యాత్రచేయుటకు మొదలుపెట్టినది నే నాక్షణములోనే! అప్పుడు నాకు కలిగిన వుత్సాహము, నూతనభావోదయము, పరమానందమూ అనిర్వాచనీయములు.

రెండుపేర్లను నేనుచదువుకొని శ్యామల కూర్చున్న బల్లవేపు చూశాను. ఆమె తలవంచి చిరునగవుతో ఏమో

వ్రాసుకొంటున్నది.

ఆమెను పరిశీలించి చూచుటకదే ప్రథమ పర్యాయము. ఆమె అప్పుడు నాకన్నులకు మర్త్యభామినివలె తోచలేదు, ప్రణయ జ్యోత్స్న వలె తోచింది! తూర్పుదిక్కున వుదయించే చంద్రబింబంలాగ మెరుస్తూ వున్నది కుంకుమ బొట్టు ఆమె మొగాన.

మధ్యాహ్న కాలాన్ని నడిమింట మార్తాండబింబంలాగ ప్రజ్వలిస్తున్నది అనురాగం ఆవిడ హృదయాన. సాయంకాలాన్ని పక్షులు ఎలుగెత్తి పాడే ప్రణయ గీతములు ప్రతిధ్వనిస్తున్నాయి ఆమె హృదయంలో. తేటవెన్నెల నిగ్గులలో దోబూచులాడే జీవకాంతులు ప్రకాశిస్తున్నాయి ఆవిడ కళ్ళల్లో.

ఆనాటినుంచీ నేను పుస్తకములు ముట్టలేదు, చదువుమాట తలపెట్టలేదు. ఆనాటినుంచీ నేను శ్యామలపేరు జపించడం మొదలు పెట్టేను. ఆనాటినుంచీ నాకు శ్యామల ప్రత్యక్షదైవతమైనది. నిద్రను జయించాను. ఆకలిని జయించాను. ఆమె ప్రాపు గైకొనడానికై ఎంతటిత్యాగమైనా చేయగలను. మూర్తీభవించిన సౌందర్యరాశిమ్రోల యెట్టిసూడిదనైనా పెట్టగలను. విలువలెరుగని ప్రణయసౌధమున నివసించడానికి లోకముతో సంబంధం వుండకూడదు. అట్టి సంబంధాలన్నీ వదలుకున్నాను.

శ్యామల మహారాష్ట్ర బ్రాహ్మణ యువతి, అవివాహిత, సంఘసంస్కర్తల యింట బుట్టినది. యౌవనలావణ్యము పుంజీభావము చెందియున్నది ఆమెయందు. నే నాంధ్రుడను, ఆమెపై నా మనస్సు లగ్నము కానేల? కాకూడదా? బహుత్వము మానవులందు గానవచ్చినా ఏకత్వభావము వారి హృదయములకు బట్టలేదా? ఇంక జాతివిచక్షణయేల?

సంతోషమనగా నెట్టిది? దుఃఖాభావమా సంతోషము? కాదు. ప్రణయాగ్నిజ్వాలల బడి తప్తమగుచున్న నాకు సంతోషముగాక దుఃఖమెట్లు? సహింపశక్యము కాని ప్రణయ ఝంఝానిలమున బడి ఊపిరి తిప్పుకోలేకుండా వున్ననాకు సంతోషము కాదా?

గంభీరమై, తరింపనలవిగాని ప్రణయ సాగరమున బడి కొట్టుకొనుచున్న నాకు సంతోషమే కదా! బ్రహ్మసృజించిన వస్తువులందు ప్రణయమే లేకున్న సృష్టి కెంతలోపము వచ్చి యుండేదో!

ఆమె విగ్రహం ఆనాటినుంచీ నాకు కళ్ళకు కట్టినట్లు వుంటూండేది. ఆరోజు మొదలుకొని నేను కాలేజీకి పదిగంటలకు ముందే వెళ్ళికూర్చుని ఆమెరాకకు ఎదురు చూస్తూవుండేవాడను. ఆమె యడుగుల చప్పుడుకు నాగుండె తాళము వేస్తున్నట్లు కొట్టుకొనేది. ఆమెవిగ్రహమును చూడడమే నాకు తృప్తిగా వుండేది. ఆమెతో మాటలాడడం సహితం లేదు. ఆమె విగ్రహమునుండి వెడలివచ్చు లావణ్య కాంతులను కన్నులతో తృప్తితీర తాగేవాడను. ఆమెవిగ్రహ మెదురుగా వున్నసమయంలో నేను చెప్పలేని ఆనందము చెందేవాడను. ఆమె విగ్రహమును వీక్షించుటకై ఎప్పుడు నేను ఉవ్విళ్ళూరుతూ వుండేవాడను.

ఆమెరాకనాకు ప్రమోదకారణ

ము, ఆమె శోకడ విషాదకారణమూ.

ఆమె సాయంత్రం కాలేజీనుంచి వెళ్ళిపోయేటప్పుడు చూపు మేరదూరం ఆమెను చూస్తూ వుండడమే నాపని. ఆమె దృష్టినిదాటి వెళ్ళినతోనే నాగుండెలో రాయిపడేది. మరునాడు పదిగంటల వరకూ కాలము పుచ్చడం ఎట్లు?

నాజీవిత మప్పుడు శుష్కముగావుండేది. కాని మరునాడు వస్తుంది గదా, వస్తేమళ్ళీ జీవితానికి ఆనందం వుంటుందిగదా అనే ఆశవూతగా వుండేది.

ఊసుపోక ఒక్కొక్కప్పుడు నేను సాయంకాలము మైలాపూరు వెళ్ళేవాడను. మైలాపూరులో ఆమెకాపురముంట ఆమెయింటివద్ద నేను గడిపిన కాలమింతింతకాదు. ఎందుకుగడపితి? ఆమెవిగ్రహము నాకగుపించునా? కాదు. ఆమెతో ప్రసంగించవలెననా? కాదు. ఆమెమాటలు వినవచ్చుననా? కాదు. ఎందుకు అక్కడకి వెళ్ళితినో నాకు తెలియదు. నాహృదయము నన్ను అక్కడకు పట్టిఈడ్చుకొనిపోయింది. అంతేనేనెరుగుదును. ఒక్కొక్కప్పుడు ఆమెవిగ్రహము నాకు కనువిందొనగుచుండేది. ఆమె యవ్యక్త మధుర కంఠధ్వనులు నావీనులకు విందొనగేవి. ఆమెపైనుండి విసరుగాలి నన్ను రాచుకుపోయేది. ఆమెఆఘ్రాణించిన పువ్వుల వాసన ఒక్కొక్కప్పుడు నానాసాపుటముల దరిజేరేది. ఆమెపైబడిన దీపపుకాంతులు ఒక్కొక్కప్పుడు కిటికీనుండి వచ్చి నాపై బడేవి! అదిచాలదా? ఆఆనందమునకు సాటివచ్చు ఆనందము కలదా? ఇట్లునేను సెలవులిచ్చువరకూ కాలం గడపినాను.

సెలవులు. రెండు నెలలు నేను కాలము గడపడం ఎట్లు? సూర్యకిరణములకు సోకుతూ వున్నప్పుడే మొక్క ఏపుగా పెరిగి పువ్వులు తొడుగుతుంది చీకటిలో అది పెరగగలదా? సముద్రంలో నుండే జలచరములు సహితము సూర్యకాంతికోసం పగటివేళలందు పైకి వస్తవి, కాని ఎప్పుడూ అడుగున కూచోవు.

ఈరెణ్ణెల్లూ గాఢాంధకారంలో నేను మసలగలుగుదునా? నెలకు కొన్ని రోజులపాటు వెన్నెలవుందికాబట్టే లోకం కలవరం చెందడం లేదు. ఒక్కమారైనా వెన్నెల చూడకుండా రెండు నెలలు నేను బ్రతుకగలనా? సముద్రములో పడవకు తెరచాపలు చిరిగిపోతే దానిగతి ఏం కావలసింది? స్టీమరులో ఇంజను పాడైపోతే నడిసముద్రంలో అది ఏమి కావలసింది?

తుట్టతుదకు మనస్సు గట్టిపరచుకొని నేను శ్యామలకు ఒక చీటీ వ్రాసిపంపినాను. ఇదివరలో ఆమెతో నొక్కమారైనా మాటాడ లేదు. ఒక్కమారైనా ఆమెకు ఉత్తరం రాయలేదు. ఈమారే వ్రాశాను. ఈరీతిగా రాశాను.

"శ్రీమతీ,

తలవని తలంపుగా మీరు నాపై చూపిన యాదరమునకు కృతజ్ఞుడను. ఈయాదరము స్నేహముగా పరిణమించుటకు నే నాశపడుతున్నాను. మీ యోగక్షేమములు నాకు సెలవులలో తెలియజేయవలెనని కోరుతున్నాను. అందు కనుగుణముగా మీరు మీచిరు

నామా నాకు పంపవలయును. ఇట్లు నేను స్వతంత్రించి వ్రాయుట మీకు సమ్మతముగా నున్నదని సూచించుటకు నాకు జవాబు వ్రాయవలయును.

భవచ్ఛ్రేయోభిలాషి,
శ్రీధర రావు."

ఈచీటిని పోస్టుద్వారాపంపి జవాబుకై వేచియుంటిని. మరునాడు నాకు ఈక్రిందిరీతి జవాబు వచ్చినది.

"శ్రీయుత శ్రీధర రావుగారికి:

తాముపంపిన ఉత్తరము నాకు సమ్మతమేనా అని అడుగవలెనా? మీ క్షేమమును తెలిసికొనుట అను భాగ్యమును మించిన భాగ్యమునకు వేరు లేదు. నేనుచూపితినన్న ఆదరమునకు మీరింతకాలము మిన్నకుండుట వలన నేను కించపడుచుంటిని కాని మీయుత్తరము చూచిన పిమ్మట నేనాశకు లోనైతిని. మీ క్షేమమే నా క్షేమముగా చూచుకొనడమున కిష్టపడుచుంటిని. నాచిరునామా ఇందులో బంపితిని.

శ్యామల"

ఈవుత్తరమును నేనెన్నిమార్లు చదివితినో దేవునికే తెలుసును. నేనింతకాలమూరకుండుటకు కారణమును నేనేగ్రహింపలేకపోతిని. ఇక నాజీవనము ధన్యమైనదనుకొంటిని.

3

మా యిద్దరకును రెండు నెలల పాటు ఉత్తర ప్రత్యుత్తరములు జరిగినవని వేరే చెప్పవలెనా? నేను అందరాని పళ్ళకోసం అర్రులుచాపలేదని వేరే చెప్పవలెనా? నామనోభీష్టము సిద్ధించునని వేరే చెప్పవలెనా? మౌక్తికముల కోవను బోలిన యామె యక్షర మాలికలు వుత్తరంలో చదివి చదివి నేనున్మత్తుడనయితిని ప్రేమదోన్మత్తత. సౌహార్దమును వెలిబుచ్చు ఆమె జాబులు చదవడము నిత్యోత్సవముగా నేను పరిగణించుటలో వింతేమున్నది. ఆమె నాకు వ్రాసిన జాబులకు లెక్కలేదు నేను వ్రాసిన జాబులకంతకన్న లెక్కలేదు. మార్తాండుడపరదిక్కున క్రుంకువేళ శీతల వాతమనుభవించుచు ఏచెట్టుమొదటనో కూర్చుండి ఆమెయుత్తరము లెన్నిమారులైనా పఠించితిని. నిశాసమయముల నామె సుందరవిగ్రహమును మానసవీథులందు సంచరింపజేస్తిని. నాహృదయసీమనా లేఖల నన్నిటిని బదిలబరచితిని. ఇట్లు గడచినవి ఆరెండు నెలలూ. ఒక్కతృటిలో గడచినవనుకొంటిని. సౌఖ్యోన్నతి యెట్టిదో అప్పుడే నేననుభవించితిని. పెరుగుట విరుగుట కొరకే అనియొకకవిఅన్నాడు. పెరిగితిని పెరిగితిని చిట్టచివరకు ఇంతవిరిగెదనని ఎప్పుడును కలనైనా తలవలేదు. హఠాత్తుగ పిడుగు నాపై బడుటకు ముందు నామనోహారిణి ఒక్కలేఖ పంపింది. ఆలేఖయే ఆమె నాకు రాసిన చివరలేఖ. ఆలేఖలోనే ఆమె నాకీయగలిగిన సౌఖ్యమంతా ఇచ్చినది. ఇంకామెనుండి నేను లేఖలనందు భాగ్యమును గోల్పోతిని. మందభాగ్యుడనయితిని.

పూనా,
౨౮-౧-'౫౩.

"మనోహరా,

శుష్కించిన ఈనా జీవితవృక్షమునకు మీరు ప్రాణప్రదమైన నీరము నొస

గుచున్నారు. ఈవృక్షమేపుగా పెరిగి మీకు ఫలముల నొసగ గలదని ఆశిస్తున్నాను. నాసుఖమే మీసుఖమనియు నాదుఃఖమే మీదుఃఖమనియు వ్రాస్తిరి. నాసుఖము మీసుఖము కావచ్చును. నాదుఃఖము మీదుఃఖము కానిత్తునా? మీపాద సేవ సేయుచు మీయండను చరింపవలెనని ఉవ్విళ్ళూరు నాకెన్నడైన దుఃఖముండగలదా? సూర్యున కెదురుగా నుండు గ్రహముల నెన్నడైన చీకటి కప్పగలదా?

ఏనాడు మీపై నేను వీక్షణమాలికల బరపితినో ఆనాడేగదా నాజన్మము ధన్యమైనది !

ఏమో? తెలియదు ,ఎందుకో తెలియదు ! మిమ్ములజూచిన క్షణమందే నామనస్సు మీపై లగ్నమైనది. ఎన్నోసారులు నేను వితర్కించుకొన్నాను, నామనస్సు మీపై వలపరుగులు పెట్టవలయునని? సూర్యునిచుట్టును గ్రహములెందుకు తిరుగుచున్నవి? నదులన్నీ సముద్రముననే వలచేరుచున్నవి ? అయస్కాంతము ఇనుమునేల యాకర్షింపవలె? దీనికి సమాధాన మేమి ? అనుకొన్నాను.

దుష్యంతు డెందరు స్త్రీలను జూచి యుండలేదు? ఆతనిమనస్సు శకుంతలపైనే లగ్నము కానేల?

ఇది ప్రకృతి శాసనమా ?
పూర్వజన్మ వాసనా ?
పూర్వజన్మమున మనము భార్యాభర్తలము కాబోలు!మనోహరా!మీదివ్య మంగళరూపము నాహృదయఫలకమున పాదుకొనిన దినమునుండీ మీపవిత్రనామమును సంస్మరించుచున్నాను. పంచాక్షరీమంత్రమును పారాయణ జేయుచున్నాను. ఎన్నటికైననునాతపస్సు ఫలించునా?ఎన్నటికైనను నేచేసిననోములు పండునా? ఎన్నడైనను నేను మీపాదముల నాశ్రయింపగలుగుదునా? ఎన్నటికైనను నాహృదయము మీపాదములపై ధారపోయగలుగుదునా? ఆదినమెప్పుడు వచ్చును? ఆపవిత్రదినము రావలెనని ఎంతశోషిల్లుచున్నాను! ఆశనుగోల్పోవుచున్నాను. మనోహరమూర్తీ! నాకాశయిమ్ము! నాకుత్సాహ మొసంగుము; కుంగిపోవుచున్నాను; నన్ను లేవనెత్తుము! నాథా సెలవు! మీదివ్యలేఖిని సత్వరముగ నాకుత్సాహమును ఊరటను గూర్చుగాక!

మీదాసి

శ్యామల"

ఈలేఖ జదివికొని సంతసించితినే కాని అందున్న సందేశమును గ్రహింపజాలనైతిని. "ఆదినమెప్పుడువచ్చును?" ఎన్నడునురాదు అనుసంగతి నేనుగ్రహింప జాలనైతి? ఎన్నడునురాదా? రాదా? ఆశ నిరాశ యైనదా? లోకము నచీకటిగ్రమ్మినదా? ఎన్నడూఆదినము రాదా? అయ్యో, ఎంతటిపాపిని! ఎంత దురదృష్ట వంతుడను! ఎన్నడు ఆదినమురాదా? అయ్యో; నేను మొదట గ్రహింపలేక పోతినే? దైవప్రేరణచే వ్రాసినదికాబోలు ఆవాక్యము! ఎన్నడురాదా! ఈజన్మమున గాకున్న వచ్చేజన్మమునందైన రాదా! రాకపోవునా? వచ్చును, వచ్చును, వచ్చితీరును!

౪

ఆశాలత లొకటివెనుక నొకటి పుటుకు పుటుకున తెగిపోతున్నవి. హృదయ మల్లకల్లోల మవుతున్నది.

శ్యామల చెన్నపట్టణపు పెద్దఆసుపత్రిలో రోగగ్రస్తయై మంచముపై పడియున్నది నే నాసుపత్రిలో మతిపోయినవానివలె సంచరించుచున్నాను. ఆలేఖ వ్రాసిన రెండుదినములలో పిడుగువంటి వార్త నాచెవిని పడినది శ్యామలరోగియనియు, పూనానుంచి చెన్నపట్టణము వచ్చుచున్నదనియు! ఆవార్త చెవులపడిన పిమ్మట కూడ నే నిట్లు జీవములతో సంచరించుచున్నాను. శ్యామలరోగియా నాశ్యామల! నేను ప్రేమించిన శ్యామల! నేనెవ్వతె రూపమును జూచి ప్రాణముల పోసికొనుచున్నానో ఆ నాశ్యామల! అయ్యో! భగవంతుడున్నాడా?

ఆసుపత్రిలో రామారావు నాస్నేహితుడు. అతని నెప్పుడును ఉపకారము చేయమని కోరలేదు. ఇప్పుడు కోరితిని శ్యామలనుచూచుటకు అనుజ్ఞయిమ్మని. అతడు నన్ను సమయముచూచి శ్యామల పరుండియున్న గదిలోకితీసికొనిపోవుచుండును. ఆమెగదిలో నేను ఒకపావుగంట ఉండేవాడను. తరువాత ఆసుపత్రి ప్రాకారములచుట్టూ తిరుగుతూ వుండేవాడను. ఉదయమున ఆసుపత్రి తలుపులు తీయుటకుముందు గుమ్మముకడ వేచియున్నవాడెవడు? నేనే! అర్ధరాత్రి ఆసుపత్రి గోడప్రక్క నిలుచుండి బాష్పధారల వర్షించువాడెవడు? నేనే! మధ్యాహ్నకాలమున చండకిరణుని వేడిలో శ్యామలను ధ్యానము చేస్తున్నవాడెవడు? నేనే. శ్రమకు ఫలముండునందురే? ఎక్కడ నాశ్రమకు ఫలము! ఆశీస్సులకు ఫలము! భగవంతున్నాడా?

శ్యామల మంచముకడ నిలుచుంటిని. అదిమోడ్చిన కనుదోయివిప్పిచూచినదినన్ను నాశ్యామల ఆచూపులే నాదేహమును కంపింపజేసినవి. శుష్కించిన హస్తముతో నాహస్తమునుపట్టినది నా శ్యామల. నాదేహము స్పందించినది.

నవయౌవన తేజోవిలాసినియగు నా శ్యామలకా ఈపాట్లు! ఆమెమోముపైపు ముఖముద్రిప్పలేకపోతిని. కన్నీటిమబ్బులు కన్నులగ్రమ్మెను. గద్గదస్వరముతో 'శ్యామలా' యంటిని. శ్యామలకన్నులు మూసినది. మూసినకనురెప్పలలో నుండి ఒక్కబాష్పకణము కొలుకులగుండా కారి మంచముపైపడినది. కన్నులదెరచి "మనోహరా" అన్నది. నేనుకొంతసేపటిదాకా మాటాడలేకపోతిని. నాహృదయముమాత్ర మామెహృదయముతో సంభాషించుచునేయున్నది. "ఎట్లుంటివి, రోగముఉపశమిస్తున్నదా?" అంటిని. దుఃఖమువద్దు. నిజము చెప్పుతున్నాను. నా కాయువుచెల్లినది. మనఋణము తీరినది! అన్నది. నేనుచేతులతో తలమోదుకొనుచుండగా 'నాథా'యన్నది. రామారావు వచ్చినన్నావలకు తీసుకొనిపోయినాడు.

ప్రభంజనమతితీవ్రముగ వీచుచూన్నది. వాయుదేవుడొక్కమారు తనసే

వకోట్లు లోకముపై విడిచినట్లుండెను. దశదిశలనుంచీ ఝంఝూ నిలముకొట్టుచున్నది. పంచభూతము లొక్కమారు మహాసంగ్రామమున ఒకదానినొకటి డీకొన్నవి. నవనవలాడుపూలమొక్కలు పూలరాల్చి మలినములైనవి. మహావృక్షములు దీనస్వరము చేయుచు భూమిమీదికి కుంగిపోవుచున్నవి.

ఆసుపత్రిలో ఆరుబయట మబ్బులవెనుకనున్న సూర్యునికేసిచూస్తూ నిలబడినాను. వాయువునన్ను నిలవనివ్వక తీవ్రముగ నన్నివైపులనుండి కొట్టుచున్నది. వానచినుకులు తుపాకిరవ్వలవలె మొగముపైతగులుతున్నవి. భూమితనరేణువులపైకెత్తినన్నుగట్టిగా మోదుచున్నదిసూర్యతేజము మబ్బుల చాటుననుండి బయలువెడలి నాకన్నులంపొడుచు చున్నది. భూతములునాపై నాగ్రహించినవి. భూతములునన్ను వేధించుచున్నవి. వేధించనిండు. సూర్యభగవానుడే యాధారమనిమనస్సును దిటవుచేసికొని ఆతనివైపు కన్నులద్రిప్పిప్రార్థిస్తున్నాను. "లోకభాంధవుడవుగదా దేవా! నాశ్యామలయెడ నీవుచూపుచున్న బాంధవ్యమేమి? లోకమునకంతకును జీవనము నొసంగగలనీవు నాశ్యామలజీవనము లపహరించుచుంట న్యాయమా భగవానుడా! ఆమె తేజమునునీలో కలుపుకొన నిచ్ఛగించెదవేల ? నీకు తేజము కొరతపడినదా ? ప్రాణికోటి కంతకును బంధువుడవై ఒక్కనాయెడ శత్రుత్వము వహింపనే నేమియపరాధ మొనరించితిని? భగవానుడా! నాప్రార్థన వినవా? నాశ్యామలను నాకివ్వవా! నీకేమియర్పింపమందువు? ఏదియైన నీకర్పణముచేయ సిద్ధముగనున్నాను. దయరాదా? నాశ్యామలను నాకివ్వవా?" రామారావువచ్చినా చేయి పట్టుకొనెను. ఆతని ముఖము వెల్ల బారియున్నది. నన్నుగదిలోనికి వెళ్ళమని సైగజేసినాడు. ధైర్యము పూనమన్నాడు. అయ్యో! ఇంకను నాకుధైర్యమా? మంచముపై చలనము లేక పడియున్న నాశ్యామలను ఆయవస్థలో చూస్తున్నాను. నాకుధైర్యమా? పుష్పము వాడిపోయినది. దానికాంతులు మాయమైనవి. శాంతమూర్తివలె పరుండియున్నది నాశ్యామల, గుమ్మముకడ నిలుచుండి చూస్తిని. మంచముచుట్టు ఆమెబంధువు లిద్దరు ముగ్గురున్నారు. మంచము ప్రక్క దొరసాని నిలువబడి మందులు తాగించుచున్నది. మందులు వంటబట్టడము లేదు.

మృత్యుదేవత యాకబళము నాశించినది. మృదుగాత్రిలను నోటవైచికొనినగాని దాని యాకలి యుపశమించదుకాబోలు!

అయ్యో భగవంతుడున్నాడా? ఉన్నచో నాప్రార్థననేల వినకున్నాడు? ఆమెప్రాణమును నిల్పుటకు నాప్రాణమును త్రికరణశుద్ధిగ ధారపోసెదననుచున్నానే? వినడేమి భగవంతుడు? ఆవిడరోగాన్ని మరల్చివెయ్యమంటూన్నానే ఆరోగమును నాకివ్వమంటున్నానే వినడేమిభగవంతుడు? ఆమెకష్టములనన్నియునేనుభరించెదననుచున్నానే? ఆమెను కష్టముల నుండివిముక్తిచెయ్యమంటు

న్నానే? ఆమెకష్టము చూచి సహింపజాలకున్నానే? ఆకష్టముల నేమిగ్రింగివేసెదననుచున్నానే, వినడేమి భగవంతుడు

మంచమున కెదురుగా నిలబడితిని. శ్యామల నన్ను చూచినది చేయెత్తి పిలవబోయినది దగ్గరనా. చేయెత్తలేకపోయింది, ఆచేతిని నాచేతులలో నిముడ్చుకొన్నాను. ఆమెనాచేతిని మెల్లగా నొక్కినది.

దొరసాని పెదవివిరచి బయటికి వెడలిపోయినది. అవసానము సమీపించుచున్నది. నాఆశ రెక్కలు కట్టుకొని ఎగిరిపోయినది. కొయ్యబొమ్మవలె నాశ్యామలకేసి చూస్తూ నిలబడ్డాను.

రంయిమని గాలివీస్తూ ఆసుపత్రి నిటునటూ ఊగిస్తున్నది. శ్యామల నావైపు కన్నులు త్రిప్పినది.

అయ్యో దైవమా! ఆమెనింకొక్కయేడు బ్రతుకనివ్వవా? నాజీవనమును ధారపోసెదను, ఆమె నొక్కమాసము బ్రతుకనివ్వవా? నాసర్వస్వము నీకర్పణము చేసెదను? ఆమె నింకొక్క రోజైన బ్రతుకనివ్వవా? ఇంకొక్కగంట, ఒక్క గడియ బ్రతుకనివ్వవా? అయ్యో

ఆమెనాపైనుంచిన దృష్టులు మరల్పలేదు. ఇంకెవ్వరిని చూచుచుండలేదు. నాకేసిచూస్తూచూస్తూ ఉండగా అప్రయత్నముగా ఆమెకనురెప్పలు మెల్లగా రాలిపోతూవున్నవి. కనురెప్పలు మూసినది లోకమంతా చీకటి గ్రమ్మినది. సూర్యుడాకసమును బాసి ఎక్కడికో పోయినాడు. వాయువు ప్రచండముగ ఘోష పెట్టుతున్నది.

ఒక్క మారునాక్రిందనున్న భూమి విచ్చిపోయినది. ఆ అఖాతములో నేబడితిని.

... ... ...

చదువరులకు మనవి: శ్రీధరరావుగారు ప్రేమించిన మహారాష్ట్ర యువతి పేరు శ్యామలకాదనీ ఆమెపేరు వెల్లడిచెయ్యడానికిష్టములేక మారుపేరు పెట్టినారనిన్ని ముకుందరావుగారు చెప్పుతున్నారు.

తమజీవితమున నొక్కఅంశమే వ్రాసియుండీ శ్రీధరరావుగారు దానికిస్వీయచరిత్రమని పేరు వెట్టినారు. జీవితమునకంతకూ మూలాధారమైన ఈఅంశమే ముఖ్యాంశముగా వారు గ్రహించడముచేత ఆలాపేరు పెట్టివుండవచ్చును.



# మొదటి ముద్దు

[రవీంద్రుని 'చైతాలి' నుండి]

శ్రీ. వీరరాఘవ స్వామి

కన్నులను మూసి దశదిశల్ కదలకుండ
మెదల కుండ ఖగాళి సంగీత మాపి
మారుత మ్మెల్లకడల స్తంభించి పోయె,
అణగి పోయెను సలిల కలస్వనంబు
అడవి మర్మర మడవి మర్మమున దూరె,
నిర్జనం బయ్యె శాంతనదీ తటంబు,
భూనభంబులు నిస్తబ్ధములుగ నుండ,
శాంతగతిబర్వుచుండె సాయాహ్న కాంతి
అట్టి యేకాంతమున గవాక్షమ్ము జేరి
యిర్వురము పెట్టుకొంటిమి మొదటిముద్దు
దిగ్దిగంతము లందంత దేవళముల
హారతుల శంఖఘంటారవాళి మ్రోగ
సంభ్రమించె ననంత తారాగణంబు
మాకనుల యందు నశ్రుజలంబు నిండె!

# సాహిత్య తత్త్వము

రవీంద్రుని మతము

బాహ్యజగత్తు మన మనస్సులో ప్రవేశించి ఇంకొకజగత్తు అవుతున్నది. దానియందు కేవలము బాహ్యజగత్తువర్ణము' ఆకారము, ధ్వని, మొదలైనవి కాక వాటితోపాటు మనయిష్టానిష్టములు, భయవిస్మయములు, సుఖదుఃఖాలుకూడా చేరుతవి. అట్టిజగత్తు మన హృదయవృత్తుల విచిత్రరసములో బహువిధాల ప్రతిఫలిస్తూ వుంటుంది. ఈ హృద్వృత్తుల రసములో గుచ్చియెత్తి బాహ్యజగత్తును మనదానిని చేసుకొంటాము.

జఠరములో తగినంతరసము లేక పోవడముచేత పదార్థములను చాలామంది చక్కగా జీర్ణము చేసుకోలేనట్లు హృదయవృత్తులరసముతగినట్టుగాజగత్తు మీద ప్రయోగించ లేనివారు బాహ్య జగత్తును అంతర్జగత్తుగా, తమజగత్తుగా, మానవజగత్తుగా, చేసుకోలేరు.

కొందరు జడప్రకృతు లున్నారు. లోకములో చాలా తక్కువసంగతులే వారికి సంతోష మిస్తవి. వారు లోకములో చాలా భాగమునుండి వంచితులవుతున్నారు. వారి హృదయగవాక్షములు చాలాచిన్నవి, ఇరుకువీ కావడముచేత లోకములోవారు ప్రవాసులవలె వున్నారు.

కొందరుభాగ్యవంతు లున్నారు. వారివిస్మయము, ప్రేమ, కల్పన —ఇవన్నీ సర్వత్ర మేలుకొని వుంటవి. ప్రకృతి

భవనములో ప్రతిగదిలోకి . వెళ్ళడానికీ వారి కాహ్వానము వస్తూవుంటుంది. లో కభవనములో సమస్తాందోలనలు వారి హృదయవీణను అన్ని రాగాలతో పలికి స్తవి.

ధ్యానుల ఈజగత్తు బాహ్యజగ త్తుకంటె మనిషికి ఎక్కువ ఆత్మీయము. హృదయపుసహాయముతో మానవహృ దయమునకిది సుగమ మవుతుంది. మన చిత్తపరిభావముచేత ఇది పొందే విశేష త్వమే మనిషికి అన్నింటికంటె గ్రాహ్య ము. అందుచేతనే బాహ్యజగత్తుకు మా నవజగత్తుకూ పరిభేదముకనబడుతున్నది.

మానవ జగత్తు అనేదిప్రతివానిహృద యములోనూ ప్రవహిస్తూవస్తున్నది. ఈ ప్రవాహము పురాతనము, నిత్యనూతన ముకూడాను. నూతనహృదయములగుం డా ప్రవహిస్తూ ఇది యెల్లప్పుడూకొ త్తది అవుతున్నది.

అయితే ఇది ఎలా లభిస్తుంది?దీన్నిని లిపిస్తుంచడము ఏలాగు? రూపములేని ఈమానసజగత్తుకు రూప మిచ్చి, మ ళ్ళీ బయట ప్రకాశింపజేయలేకపోతే ఇ ది యెప్పుడూ సృష్టమై, నష్టమై పోవ చ్చును.

కాని, ఈవస్తువునష్టము కావలెననికో రము. హృదయప్రపంచము స్వయంవ్య క్తము కావడానికి వ్యాకులమై వుంటుం ది. అందుచేతనే బహుకాలమునుంచి మనిషికి సాహిత్యోద్రేక మున్నది.

సాహిత్య విచారణ చేసేటప్పుడు రెండుసంగతులు చూడవలె: సాహిత్య కారుడు విశ్వమును ఎంతవరకు లోబరు చుకొంటున్నాడు? అది స్థాయిగా ఎంత వరకు వ్యక్తమవుతున్నది?

అన్ని వేళలా ఈరెండింటికీ సామంజ స్యము ఉండదు. ఉన్న చోట బంగారము వలె సొగసుగా వుంటుంది.

కల్పనవల్ల సజీవమైన కవిహృద యము విశ్వవ్యాపి అయిన కొద్దీ, అతని రచనలో గభీరతవల్ల మనతృప్తి వృద్ధిఅ వుతుంది; మానవ జగత్సీమ వ్యాప్తిచెం దుతుంది, మన శాశ్వత విహారభూమి విశాల మవుతుంది.

రచనాశక్తి నైపుణ్యముకూడాసాహి త్యములో అమూల్యము. ఏమంటే, దే నిని అవలంబించి ఈశక్తి ప్రకటమవు తుందో అది తక్కువదయినప్పటికీ శక్తి కిమాత్రము లోపములేదు. ఇదిభాష లో, సాహిత్యములో సంచితమైవుం టుంది. దీనివల్ల మానవుల ప్రకాశశక్తి వృద్ధి అవుతుంది. ఈశక్తి పొందడానికి మానవులు బహుకాలమునుంచి వ్యాకు లులై వున్నారు. ఏకవుల సాయము చేత ఈశక్తి పరిపుష్ట మవుతుందో వా రిని మానవులు పొగడి కృతజ్ఞత చూపు తారు.

హృదయ భావమువల్ల లోపల సృ ష్టమయ్యే మానసజగత్తును బయటికి ప్రకటించడానికి ఉపాయ మేముంది? హృదయ భావాలను ఉద్రేకింపజేస్తే అది ప్రకటమవుతుంది.

భావములను ఉద్రేకింప జేయడానికి చాలా సాధనసంపత్తు ఉన్నవి.

పురుషులు కచ్చేరికి వేసికొనివెళ్ళేవ స్త్రాలు ఎంత తెల్లగావుంటే ఎంతఆడంబర

ములేకుండా వుంటే అంత బాగుంటవి. అయితే, స్త్రీలకు ఎంత వేషభూషలు, లజ్జ, భావభంగులూ వుంటే అంత సొగసుగా వుంటుంది. ఈవిషయము అన్ని సభ్యసమాజములోనూ వున్నదే.

హృదయాకర్షణము స్త్రీలపని. వారు హృదయమునియ్యవలె, హృదయమునాకర్షించవలె. వారు మామూలుగా, సాదాగా వుంటే చెల్లదు. పురుషులు అలాఅలా వుండడము అవసరము, స్త్రీలు సొగసుగా వుండడము అవసరము. పురుషులసంగతులు మొత్తముమీద స్పష్టముగా వుంటేమంచిది. అయితే స్త్రీలసంగతులు ఆవరణములోను, సూచన (ధ్వని)తోనూ వుండడము యుక్తము.

తనప్రయత్నము సఫలము కావడానికి అలంకారాలు, రూపకము ఛందస్సు ధ్వని—వీటిని సాహిత్యము ఆశ్రయిస్తుంది తత్త్వశాస్త్రమువలె అలంకార విహీనముగావుంటే చెల్లదు.

రూపరహితమైన దానిని రూపము ద్వారా వ్యక్తము చేసేపక్షమున రచనలో అనిర్వచనీయతను రక్షించవలె. స్త్రీలకు శ్రీహ్రీలవలె సాహిత్యానికి అనిర్వచనీయత వున్నది. అది అనుకరణానికి అతీతమైనది, అలంకారమును అతిక్రమిస్తుంది—దానివల్ల మరుగుపడదు.

ఈఅనిర్వచనీయత్వమును భాషలో ప్రతిష్ఠించడానికి ముఖ్యముగా రెండువస్తువులను సాహిత్యము దానిలో మిశ్రము చేస్తుంది; గానమును, చిత్రమును.

మాటలతో చెప్పడానికి వీలులేనిదానిని చిత్రము ద్వారా సూచించ వచ్చును. సాహిత్యములో ఈచిత్రవస్తువులకు అంతము లేదు. ఉపమారూపకముల ద్వారా భావము ప్రత్యక్షము కావలెనని కోరుతాము. వ్యాకులదృష్టిలో వ్యాకులత్వము కేవలవర్ణనవల్ల వ్యక్తముకాక 'దృష్టిపక్షివలె ఎగిరిపోయింది' అనే చిత్రరూపువల్ల స్పష్టమవుతున్నది

ఛందస్సులోను, శబ్దములోను, వాక్యవిన్యాసములోనూ సాహిత్యము సంగీతమును ఆశ్రయించవలెను. ఏవిధముగానూ చెప్పడానికి వీలులేనిదానిని సంగీతముద్వారా చెప్పవచ్చును. అర్థము విడగొట్టి చూస్తే అతిసామాన్యముగా వుండేమాటలు ఈసంగీతము (మాధుర్యము)వల్ల అసామాన్య మవుతవి. మాటలలో వేదనను ఈమాధుర్యమే సంచరింపజేస్తుంది.

కాబట్టి, చిత్రము, సంగీతమూ సాహిత్యానికి ప్రధానోపకరణాలు. చిత్రము భావానికి ఆకార మిస్తుంది, సంగీతము గమనము కలిగిస్తుంది. చిత్రము దేహము, సంగీతము ప్రాణము.

సాహిత్యములో నిలపవలసింది మానవహృదయము మాత్రమేకాదు; మానవచరిత్రకూడా నిలపవలసిందే. మానవచరిత్ర జడసృష్టివలె ఇంద్రియములద్వారా శీఘ్రముగా గ్రహించ దగినది కాదు. ఆగమంటె అది ఆగదు. మనిషికి చాలా కుతూహలము కలిగిస్తుంది. కొట్టములో పశువును బంధించినట్టు దానిని బంధించి నిలుపడము సాధ్యము కాదు.

నిలువబెట్టివుంచడానికి వీలులేనియీ మానవచరిత్రను అంతర్జగత్తునుంచి బ

యటికి ప్రకాశింప చేయడానికి సాహిత్యము అభిలషిస్తుంది. దురూహ్యమైన పని! ఏమంటే, మానవచరిత్ర స్థిరమైనది కాదు, సుసంగతము కాదు. దానిలో ఎన్నో అంశలున్నవి, ఎన్నో తరములున్నవి. ఇంతేకాక, దానిలీల మిక్కిలి సూక్ష్మము, అచింత్యము, ఆకస్మికము, దానిని సంపూర్ణముగా మనస్సున పట్టించుకొనడము అసామాన్య శక్తితో కూడిన కార్యము. వాల్మీకి, వ్యాస, కాళిదాసాదులు దీనిని సాధించినారు.

మన మాలోచిస్తున్న విషయము ఒక్క వాక్యములో చెప్పవలెనంటే సాహిత్యవిషయము మానవహృదయము, మానవచరిత్రమూ అని చెప్పవలసి వస్తుంది.

అయితే, మానవచరిత్ర బహుళమయినట్టు చెప్పినాము. వస్తుతః, బహిః ప్రకృతి, మానవచరిత్ర మనుష్యుల హృదయాలలో అనుక్షణము ఏఆకారము ధరిస్తున్నవో, ఏసంగీతము పలికిస్తున్నవో ఆచిత్రమే, ఆసంగీతమే భాషతో చెప్పితే సాహిత్యమవుతుంది.

భగవంతుని ఆనందము ప్రకృతిలోను, మానవచరిత్రలోను తన్ను తాను సృష్టిచేసుకొంటుంది. మానవహృదయము కూడా సాహిత్యములో తన్ను సృష్టిచేసుకోడానికి, వ్యక్తము చేసుకోడానికి ప్రయత్నిస్తుంది. ఈవిచిత్ర ప్రయత్నానికి అంతము లేదు. మానవహృదయములోని ఈనిరంతర చేష్టకు కవులు లక్ష్యమాత్రులు.

భగవంతుని ఆనందసృష్టి తననుండి తానే ఉత్సారితమైనది. మానవహృదయములోని ఆనందసృష్టి దాని ప్రతిధ్వని. ఈజగత్తును సృజించే ఏఆనందగీతఝంకారము మనహృదయ వీణాతంత్రులను అహరహము మోగిస్తున్నదో, భగవంతుని సృష్టికి ప్రతిస్పర్ధిగా మనహృదయములో ఏమానససంగీతము ఆందోళన చేస్తున్నదో దాని వికాసమే సాహిత్యము. బ్రహ్మాండ నిశ్వాసము మనచిత్తవేణువులో ఏరాగములు పలికిస్తున్నదో ఆరాగములను స్పష్టముగా ప్రకాశింపజేయడానికి సాహిత్యము ప్రయత్నిస్తుంది. సాహిత్యము వ్యక్తివిశేషము కాదు, రచయితది కాదు, అది దైవవాణి. దానిమంచిచెడ్డలను, అసంపూర్ణత్వమును గ్రహించి బాహ్యజగత్తువ్యక్తము కావడానికి ప్రయత్నిస్తున్నట్టు ఈవాణి దేశదేశాలలో, బహుభాషలలో మానవ హృదయములోనుంచి బయటికి ప్రకాశించడానికి నియత ప్రయత్నము చేస్తున్నది.

# కవివంతు

పెద్దిభట్ల పూర్ణశర్మ

(జర్మన్ మహాకవి షిల్లర్ భావము ననుసరించి).

ఈ ప్రపంచము మీకు నేనిచ్చుచుంటి,
కలహములు లేక యన్నదమ్ముల విధాన,
పంచుకొని మీరు హాయిగా బ్రతుకుఁడింక
అనుచు లోకేశుఁ డందఱి కానతిచ్చె.
పచ్చికబయళ్ళు గొనెఁ గృషీవలుఁడు బల్మి,
పసుగు లిడు లేడి వెంబడి బడె వయస్వి,
వంతెనలు, కాల్వ లరికట్టె పార్థివుండు
ప్రజలకడనుండి కొనసాగె పన్ను లెన్నొ
అందఱన్ని విధంబుల నవని యెల్ల,
బంచుకొన్న కొన్నాళ్ళకు పరుగులిడుచు
దూరదేశమునందుండి చేరి సుకవి
అందఱన్నిటి కధికారులగుట గాంచి,
"ఏమియును లేకపోయె, నే నేమిచేతు
ఇంక నాకేమిదిక్కు? జీవించుటెట్లు?
ఓ మహాదేవ, నిను నమ్మియున్న సుతుని
అదనునకు ఇట్లు మఱవగానగునె తండ్రి?"
అని నిరాశను దుఃఖించు చాతఁ డంత
నఖిల లోకేశు మ్రోల సాష్టాంగ పడియె

ఎచటనో నీవు కూర్చుండి యింతవఱకు
నిపుడు నాకడ దుఃఖింప నేమిఫలము,
విశ్వమును విభజించిన వేళ నీవు
ఎచట నున్నావొ చెప్పుమో యీ
కవీంద్ర?"
"నేను నీ ప్రక్కనే యుండినాను దేవ!
విమలకమనీయ మాధురి వెలయు నీదు
కంఠరవమును వినుచు నాకర్ణ ముండె;
కోటిసూర్యుల కాంతిని గోటమీటఁ
జాలు భవదీయ దివ్య తేజంబు గనుచు
నిశ్చలంబుగ నుండె నానేత్రయుగళి;
మానసంబు నీయందున మగ్నమయ్యె,
మఱచిపోతి ప్రపంచపు మాట నేను!"
"అందఱన్నిటి కధికారు లైరి ముందె,
ఊర కున్నది లే దొక్క టుర్వియందు.
కాని నీకు నవీ నాధికార మిత్తు:
తలుపులను నెట్టి నా సన్నిధానమునకు
ఇచ్చవచ్చినయపుడు రావచ్చు నీవు!"

# పద్యములు

పెద్దిభట్ల పూర్ణశర్మ

పొందు దేశాటనము చేయ పొందు మీరు
పంపుచుంటిని మిమ్ము హృద్ద్వారమునను!
హృదయఫలకంబునందు జన్మించినారు
ఊహా రసమున నభివృద్ధి నొందినారు
పరులందలయెత్తియెపుడు మీరరయ లేదు
స్నేహితుల నప్పుడపుడు వీక్షించినారు
ఈడు వచ్చుటఁ దగదు మీ కిచట నుండ

పొందు దేశాటనము చేయ పొందు మీరు
పంపుచుంటిని మిమ్ము హృద్ద్వారమునను
పలువురు తలంచుచుందురు బహువిధాల
వారిమాటలు గాలికిఁ బాఱిపోవు!
ఎవ్వరే మనుకొన్న మీ కేమి కొదువ
పొందు దేశాటనము చేయ పొందు మీరు
పంపుచుంటిని మిమ్ము హృద్ద్వారమునను

# తెలుగు

మాసపత్రిక. ఇందులో ప్రాచీనాంధ్రము, వర్తమానాంధ్రము, భాషా సారస్వతము—పీఠికా చారణలు ఉంటవి. భాషాతత్త్వము తెలిసికొనగోరేవారు ముఖ్యముగా చదువదగినది. రాయల్ సైజు, పెద్దఅచ్చు ప్రతిసంచికలో 3౨ పుటలు సంవత్సరపు చందా రూ. ౪; వర్తమానాంధ్రభాషా ప్రవర్తకసమాజములో చేరే వారికి రూ 3. ప్రారంభము సెప్టెంబరు ౧౯౨౯.

చిరునామా: రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారు బి. ఏ.,
'తెలుగు' సంపాదకులు, పర్లాకిమిడి, గంజాంజిల్లా

---

# నవ్వులమూట

ఇదిహాస్యరసభరితమైన సచిత్రమాసపత్రిక. ఆనందదాయకముగను, నీతిదాయకముగను ఉండి, స్త్రీలు బాలురు కూడ చదువదగినంత మృదువుగానుండును.
సం. చందా రూ. ౨-౮-౦; ఆరునెలలకు రూ. ౧-౪-౦.

చిరునామా: 'నవ్వులమూట' కార్యాలయము,
పార్వతీపురము, విశాఖపట్నంజిల్లా.

---

# ప్రకృతి

ఆరోగ్యవిషయికమగు మాసపత్రిక. సం. చందా రూ. ౧-౨-౦

మందులు, శస్త్రములు అవసరము లేకనే సకలశారీరక, మానసిక రోగములను సులభముగను, చౌకగను, సహజముగను నివారింపజేయునట్టి స్వాభావిక సాధనములనుగురించి విపులముగా తెలుపబడును. తొట్టిస్నానములు చేయువారి కిది మిక్కిలి యుపయుక్తమైనది.

చిరునామా:— మేనేజరు, "ప్రకృతి" ఆఫీసు, బెజవాడ.

---

చంద్రికాముద్రాశాల, గుంటూరు.